శ్రీః

కూచిమంచి జగ్గకవిచంద్ర విరచిత

# సుభద్రా పరిణయము



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారి

4-103, ILTD Colony Entn., Kothapet, **CHIRALA** - 523 157.

శ్రీః

కూచిమంచి జగ్గకవిచంద్ర విరచిత

# సుభద్రా పరిణయము



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారి

4-103, ILTD Colony Entn., Kothapet, **CHIRALA** - 523 157.

శ్రీః

ఓం కామదేవాయ నమః

కూచిమంచి జగ్గకవిచంద్ర విరచిత

# సుభద్రాపరిణయము

ప్రథమముద్రణ :- 1935

ద్వితీయముద్రణ :- సెప్టెంబర్, 2010

ప్రతులు : 300

పేజీలు : 100

వెల రూ. : 50-00

For Copies:

**RAVI MOHAN RAO,**
4-103, I.L.T.D. Colony, Extn.,
Kothapet, Chirala.
Mobile : 9440115411

***COMPUTERISED BY :-***

**J. RAJA**
Ganesh Graphics, Chirala.
Cell : 98483 90564

***PRINTED AT:***

**SURYA OFFSET**
Chirala.

# పరిచయము

కం. బోట కలాట కిరాట వ
రాట మరాటాంగ వంగరాజన్యసభా
ఝూట నిరాఘాటనట
చ్చాటుకవిత్వాంకుడరయ జగ్గన ధరణిన్.

ఈ చాటుపద్యమును జెప్పినది కూచిమంచి తిమ్మనకవి. ఈ పద్యములోని జగ్గన కూచిమంచి జగ్గనకవి. వాని సోదరుడే ఈతడు. ఇద్దఱు నిద్దతే కాని తిమ్మనకు లేని ఖ్యాతిని తిట్టుకవిగా జగ్గన్న సంపాదించికొని అడ్డిదము సూరన, వేములవాడ భీమన సహపంక్తిని జేరినవాడు. ఈ జగ్గన వ్రాసినది ఈ సుభద్రాపరిణయము. దీనిని శృంగారరసప్రబంధమని జగ్గనయే ఆశ్వాసాంతగద్యములో చెప్పికొనినాడు. ఆతడు చెప్పక యున్నను పరిణయము లక్ష్యమైన ఇతివృత్తమునకు శృంగారరసము పట్టుగొమ్మ కాకపోయినచో వింత,విడ్డూరము కాకమానదు. శృంగారము నీ కవి కావిళ్లకెత్తి పోసినాడన వచ్చు. దీనికి చేదోడుగ వీరరసమో హాస్యరసమో ఉండుట పరిపాటి. కాని ఈ ప్రబంధమున అర్జునుని వీరము "చెలి కడ నోహో శౌర్యములే" అన్నట్లున్నది, రేఖా మాత్రముగ, విరహశృంగారమునకు వెన్నెలవలె, మలయమారుతమువలె.

ప్రబంధముపేరు చెప్పగనే వివిధ వర్ణనలుండునని చెప్పినట్లగును. కథాభాగము మలుపులు, మెలికలులేని సరళరేఖాసదృశమైనందుననో యేమో, ఇందు చదువరుల మనసును పట్టునవి వర్ణనలు, విరహములు, యాత్రావిశేషములు. వీనిని నగర–నాగరిక వర్ణనలు, ప్రకృతిదృశ్యవర్ణనలు, క్షేత్రవర్ణనలు అని విభజించవచ్చును. నగర–నాగరిక వర్ణనలు: ఈ విభాగములో చేరునవి ఇంద్రప్రస్థవర్ణన, ధర్మజవర్ణన, కృష్ణవైభవవర్ణన, సుభద్రవర్ణన, సుభద్రార్జునుల విరహవర్ణనలు. వనవిహార జలక్రీడాకుసుమాసవవర్ణనలు, చిత్రాంగద వర్ణన, రైవతకాచలోత్సవవర్ణన, ప్రలంబాదిదేవతా మహోత్సవవర్ణన, శిశిరోపచార వర్ణన, పెండ్లివర్ణన, గర్భాధానవర్ణన. ఇక ప్రకృతిదృశ్యవర్ణనలు. వసంతర్తు వర్ణన, ప్రావృట్కాలవర్ణన, సూర్యోదయాస్తమయముల వర్ణన, చంద్రోదయవర్ణన, క్షేత్ర వర్ణనలనదగినవి హిమనగము, గంగాక్షేత్రము, సింహాచలము, దాక్షారామము, శ్రీశైలము, శ్రీరంగము, తిరుపతి, రామేశ్వరము, ధనుష్కోటి, సౌభద్రతీర్థము, ప్రభాసక్షేత్రము.

ఏ కాలమువాడైనను కవి తన పూర్వకవుల పోకడలు చూచి, మెలకువలు నేర్చి వ్రాయువాడే. జగ్గన కవి కూడ చేమకూర వేంకటకవి ప్రతిభావిశేషముల ప్రభావమున వ్రాసినట్లనిపించును. అంతమాత్రమున ఆతడస్వతంత్రుడనరాదు. కవిత్వ మెంత కళయో అంత శాస్త్రము గూడ. కనుక శాస్త్రమును,కళావిశేషములను ఇతరులనుండి నేర్వవలసినదే. ఆపై కవి తన ప్రతిభను ప్రదర్శించును. జగ్గనయు అట్లే.

కథాభాగము నిజమునకు కుఱుచయైనదే. యథాసంప్రదాయము, నైమిశారణ్యమున శౌనకాదిమునులు సుభద్రాపరిణయగాథను చెప్పుమనగా రౌమహర్షిణి చెప్పినది. ఇంద్రప్రస్థాన్నేలే ధర్మరాజు విశారదుడు అను ధౌమ్యతనయుని ద్వారకకేగి వారి క్షేమమెఱిఁగి రమ్మని పంపగా, ఆతడు పోయివచ్చి వారి క్షేమమును ధర్మజున కెఱిగించి, అర్జునుని గలిసి సుభద్రసౌందర్యము నాతనికి వర్ణించి చెప్పగా, ఆతడామె విరహమున తపించుచుండగా, ద్వారకలో సుభద్రగూడ విశారదునివలన అర్జునుని గూర్చి విని విరహమున దేలును. ఆ సమయమున విప్రుడొకడు తన గోవులను దొంగల నుండి తెచ్చియిమ్మని ఆశ్రయింపగా అర్జునుడు ధర్మజమందిరమునుండి ధనుర్బాణములను తెచ్చి, దొంగలనుండి మరలించి, గోవులను విప్రునకిచ్చును. కాని, ఈ ప్రయత్నమున నియమభంగమైనందున,శిక్షగా తీర్థయాత్రాసేవనము విధింపబడును. ఉత్తరదక్షిణ దేశముల గల క్షేత్రముల దర్శించి అందలి దేవతామూర్తుల సేవించి, తీర్థముల మునిగి వచ్చుచో మలయధ్వజపాండ్యుని మణిపురమున వాని కూతురు చిత్రాంగదను చూచి మోహించును. అర్జునుని ఉదంత మెఱిగిన మలయధ్వజుడు వానికి చిత్రాంగదనిచ్చి వివాహము చేయును. కొన్ని నెలల పిదప అర్జునుడు కదలి సౌభద్రతీర్థమును జేరి అందలి నీట మునుగబోవ, అచటి మునులు ఆ నీట మహోగ్ర నక్రమొకటి కలదని ప్రమాదమును హెచ్చరించినను,లెక్కచేయక ఆ నీట దిగి నక్రమును పైకి లాగిపడవేయగా, అది అప్సరరూపై తనకును తన చెలులు ముప్వురకును దగిలిన శాపవృత్తాంతము దెలిపి, మిగత ముప్వురను గూడ శాపవిముక్తులజేయ వేడుకొని అంతర్థానయగును. అర్జునుడట్లే చేసి, వారి దీవనలంది, అటనుండి ప్రభాస క్షేత్రముజేరి సాధువృత్తి నుండెను. అక్కడికి ద్వారక చేరువలో గలదని తెలిసి, సుభద్ర గుర్తురాగా అర్జునుడు విరహతప్తుడై యుండును. అప్పుడు శ్రీకృష్ణుడు వచ్చి, రైవతకాద్రికిబోయి యుండుమనగా, అర్జునుడట్లే రైవతకాద్రిని జేరి, అట నుండెను. అంతట రైవతకాచలోత్సవ మిషమున కృష్ణుడు సపరివారముగ అటకు వచ్చి అర్జునుని తన నివాసమునకు తోడ్తెచ్చును. ఇట్లు యతియై అర్జునుడు ద్వారకకు జేరును. అట కృష్ణుడు రుక్మిణి మొదలుగా గల అంతఃపురకాంతలకు

అర్జునుడే సుభద్రకై యతివేషధారియై వచ్చెనని తెలిపి, ఆ రహస్యమును కాపాడుదని చెప్పి, సుభద్రను అర్జునయతి సేవలో నుండగా బలభద్రుడు పట్టణమున లేని సమయమున అంతిపురజనుల సహకారముతో సుభద్రార్జునులకు వివాహమును జరిపించును. కృష్ణుదు గురు పురోహిత బంధుజనులందఱకును తన యన్న బలరాముడు దుర్యోధనపక్షపాతియనియు సుభద్రార్జునుల అన్యోన్య ప్రేమను ఆతడంగీకరించడనియు చెప్పి యొప్పించి ఆ ప్రేమికులను కలుపును. బలభద్రుడు తిరిగి వచ్చుటకు ముందే ఆ జంటను నగరు దాటించును. సుభద్రార్జునులకు నగరిలోని యోధులడ్డుపడగా వారి నోడించి సుభద్రతో అర్జునుడు ఇంద్రప్రస్థము జేరి పెద్దల దీవెనలంది సుఖముండును. అంతలో బలభద్రుడు మరలివచ్చి, అర్జునుడు సుభద్రను దొంగిలించిపోయెనని విని, కోపావిష్టుడు కాగా, సుభద్రార్జునుల ప్రేమను వానికి దెలిపి, శాంతింపజేసి, ఎల్లరను గూడి కృష్ణుదు ఇంద్రప్రస్థమునకు బోయి పరామర్శించి, కథను సుఖాంతము, సుభద్రము జేయును.

జగ్గనశైలి, కవితాధార హృదయానందకరము. సంస్కృతసమాస నిర్మాణమందేమి, శబ్దార్థచాతురయందేమి, తెనుగు నుడికారమునందేమి ఈతని ప్రతిభ ప్రతిపద్యమున కనిపించును. శ్రీమజ్జగన్నాయకదేవుని కృపాలబ్ధ కవితావిభవుందనని చెప్పికొనినది అత్యుక్తి యనరానిదే.

– చింతగుంట సుబ్బారావు

ఈ గ్రంథ ప్రచురణ
పరమభాగవతోత్తముడు, శ్రీకృష్ణానుగ్రహపాత్రుడు అగు
పరీక్షిన్మహారాజు
పాదపద్మములకు భక్తితో సమర్పితము
– రామోరా

# అమృత

కూచిమంచి జగ్గకవి ప్రణీతమైన 'సుభద్రాపరిణయము' అను శృంగార ప్రబంధము 1935 లో కొల్లూరి సుబ్రహ్మణ్యముగారిచే శ్రీపతి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

అడిగిన వెంటనే ఆ మూలాగ్రము పరిశీలించి చక్కని 'పరిచయము' ను అందజేసిన చింతగుంట సుబ్బారావు గారికి నమస్సుమాంజలులు.

డా॥ చింతలపూడి వేంకటేశ్వర్లుగారు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయము, వారణాశి నుండి పి.హెచ్‌డి. పట్టాను పొంది అధ్యాపక వృత్తిని చేపట్టి, నేడు విశ్రాంతాచార్యుడుగా ప్రకాశం జిల్లా ఇదుపులపాడు గ్రామములో నివశిస్తూ, కంప్యూటర్ పరిజ్ఞానముతో చిత్రలేఖనములో మంచి అభిరుచి కలిగి తెలుగు సాహిత్యముపైన మక్కువను వీడక, నేడు ఈ గ్రంథ మీరీతిగా వెలువడుటకు కారణభూతుడవుటయేగాక అచ్చుతప్పులులేని డి.టి.పి. ప్రతిని స్వయముగా తయారుచేసి అందించుట ఎంతగానో మెచ్చదగినది. బావికాలమున మరిన్ని ప్రాచీన ప్రబంధ డి.టి.పి. ప్రతులు వీరి నుండి వెలువడునని తలంతును.

రామోరా
సంపాదకుడు

శ్రీః

"కూచిమంచి జగ్గకవి" విరచిత

# సుభద్రాపరిణయము

## ప్రథమాశ్వాసము

శ్రీ యలరన్ సుభద్రయును సీరియుఁ బార్శ్వముల న్మెలంగ న
త్యాయత లీల నీల కుధరాగ్రము నందు వసించి నిచ్చలుం
బాయక భక్తకోటి కనపాయ శుభంబు లొసంగు శ్రీ జగ
న్నాయక దేవదేవుఁ డభినంద్య కృపామతి మమ్ముఁ బ్రోవుతన్.

చ. జలజ దళాక్ష వక్షమను సౌధ తలంబునఁ గౌస్తుభాతి ని
ర్మల రుచి దీప దీప్తులు విరాజిలఁ గాఁపురముండి ముజ్జగం
బులు గరుణా కటాక్షమునఁ బ్రోఁచు జగజ్జనయిత్రి లక్ష్మి ని
చ్చలును మదీయ గేహమున సంతసమూని వసించుఁ గావుతన్. 2

చ. అగజ వివాహ వేళఁ దన యౌఁదలఁ బొల్చు సుధాంశు మండలం
బెగదిగఁ జూచి పెండ్లికొడు కేమిటికిం దలఁబ్రాల పళ్ళె మి
మ్ముగ ధరియించె నంచు నతి ముగ్ధతఁ బల్కు భవాని నెచ్చెలిం
దగఁగని నవ్వు శంకరుఁ డుదారత మాకు నభీష్ట మీవుతన్. 3

చ. కరిముఖుఁ గన్నతల్లి శశిఖండ విమండను కూర్మి రాణి భూ
ధరవరు ముద్దుపట్టి నిజదాస గృహాంగణ కల్పవల్లి ని
ర్జర నికర ప్రపూజిత విరాజిత చారు పదారవింద శాం
కరి భువనైక మాత కుతుకంబున మాకు శుభంబు లీవుతన్. 4

శా.వందారు త్రిదశాధిప ప్రముఖ దేవ వ్రాత మౌళి స్ఫుర
న్మందార ద్రుమ దివ్య సౌరభ మిళన్మంజు ప్రసూనాగ్ర ని
ష్యందన్నవ్య మరంద బిందు పరిషిక్తాంఘ్రి ద్వయుండౌ శతా
నందుండెప్పుఁడు మాకు నిచ్చు నతులానందాయురారోగ్యముల్. 5

క. తెలి లావు పులుఁగు మావులు, గల యల వేలుపుల పెద్ద గాదిలి కలికిం
బలుకుల చిలుకల కొలికిం, దలఁతున్ నా హృదయవీథిఁ దరలని భక్తిన్. 6

చ. ధనద సుహృద్గళాగ్ర సముదంచిత దివ్య కపాల మాలికల్
గనుఁగొని గొప్ప యుండ్రములుగా మదినెంచి కరంబు సాచి ది
గ్గన నవి గైకొనం దలఁచి కౌతుక లీల నటించు పార్వతీ
తనయుఁడు విఘ్నరాజు ప్రమదంబున మత్కృతిఁ బ్రోచుఁ గావుతన్. 7

ఆ. వామలూరు భవుని వ్యాసు మల్హణుఁ గాళిదాసు మాఘుఁజోరు దండిఁ బ్రవర
సేను భట్ట బాణు శ్రీహర్షు భవభూతి భారవిని మయూరుఁ బ్రస్తుతింతు. 8

గీ. నన్నపార్యునిఁ దిక్కయు నాచిరాజు సోము నమరేశు శ్రీనాథు భీమకవిని
రంగనాథునిఁ బోతయ ప్రాజ్ఞవరుని శంభుదాసుని భాస్కరు సంస్మరింతు. 9

సీ. కౌండిన్య గోత్ర విఖ్యాతునిఁ గూచిమంచ్యన్వయాంభోధి నీహార కరుని
గంగన మంత్రిశేఖరునకు నంగనామణియగు లచ్చమాంబకును సుతుని
బహుకావ్య నిర్మాణ బంధుర ప్రతిభునిఁ గుక్కుటేశ్వర కృపాంకూర లబ్ధ
సత్కవితా మహా సామ్రాజ్య భార ధౌరేయుని బుధజన ప్రియ చరితుని

తే. దెందులూరి లింగనారాధ్య దేశికేంద్ర, దత్త మాహేశ్వరాచార వృత్తి రతునిఁ
గందరాడ ఘన గ్రామమందిరుని మ,దగ్రజునిఁ దిమ్మకవిరాజు నభినుతింతు. 10

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, మహాకవి వర్ణనంబునుం గావించి యేనొక్క మహా
ప్రబంధంబు రచియింపంబూనియున్న సమయంబున. 11

సీ. బ్రహ్మహత్యాభీల పాప జీమూత జంఝూవాతమే వేల్పు సౌధ చక్ర
మురు సురాపానోగ్ర దురితాంధకారార్క కిరణమే దేవుని కేతనంబు
గురుతల్ప గమనాఘ ఘోర శుష్కాటవీ దవవహ్ని యే ప్రభు దర్శనంబు
కనకాపహరణ దుష్కలుష పర్వత మహాశని యే విభుని సుప్రసాద కణము

తే. వివిత తత్సహవాసాది వృజన కలభ, పంచముఖ డింభమే స్వామి పాదతీర్థ
మట్టి పురుషోత్త మోత్తమ పట్టణాధి, నాయకుండైన శ్రీజగన్నాయకుండు. 12

క. ఒకనాఁడు నాకుఁ గలలోఁ, బ్రకట కృపాస్వాంతుఁ డగుచుఁ బ్రత్యక్షంబై
నికటమున నిల్చి మెల్లన, నకుటిల గతి నిట్టు లనుచు నానతి యిచ్చెన్. 13

గీ. వత్స విను నీవు నా పేరి వాఁడ వగుట, నీకు భద్రంబు లిడవచ్చి నిలిచినాఁడ
పొసఁగ నిహపరసౌఖ్యంబులొసఁగువాఁడ, నిండువేడుక మదిఁబూనియుండికొనుము.

క. వెరవొప్పార సుభద్రా, పరిణయ మొనరించి మాకు భక్తి దలిర్పన్
దిరముగఁ గృతిగావింపుము, సరస యశస్సాంద్ర జగ్గ సత్కవిచంద్రా. 15

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుం దంతర్హితుం డైన నేను నత్యంత సంతుష్టాంత
రంగుండనై. 16

## -షష్ఠ్యంతములు-

క. భద్రగజ రక్షణునకు సు, భద్రా వదనాంబుజాత భాస్కరునకు ని
ర్నిద్ర ప్రభావునకు బల, భద్ర సమేతునకు విహగపతి కేతనుకున్ 17

క. ఇంద్రద్యుమ్న సరస్తట, సాంద్ర విహారానుమోద సదమల మతికిన్
జంద్రార్క నయనునకు ని, స్తంద్ర కృపాసింధునకును జనబంధునకున్. 18

క. నిరవద్య పతిత పావన, బిరుదాంకునకున్ సమస్త బృందారక కి
న్నర గరుడ యక్ష ఫణి ఖే, చర విద్యాధర కదంబ సంసేవ్యునకున్. 19

క. హరిహయముఖ నిఖిలామర, వర మకుట విఘటిత దివ్య వనరుహ రాగో
త్కర రుచి నీరాజిత మృదు, చరణ సరోజునకు భాను సమ తేజునకున్. 20

క. శక్రోపల నిభ గాత్రున, కక్రూర జనావన క్రియా సూత్రునకున్
నక్రాపహరణ కారణ, చక్రాయుధ సహిత పాణి శతపత్రునకున్. 21

క. శతధృతి నత చరణునకున్, దితిసుత కుల హరణునకు సుధీ రక్షణ వి
శ్రుత కరుణా భరణునకున్, నత జనశరణునకు నీల నగ శరణునకున్. 22

వ. సమర్పణంబుగా నా రచియింపం బూనిన సుభద్రా పరిణయంబను శృంగార రస
ప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన. 23

క. శ్రీకరమై మునిలోక వ, శీకరమై జగదతీత చిరతర బహు పు
ణ్యాకరమై నైమిశమను, ప్రాకట గహన స్థలంబు పరఁగు ధరిత్రిన్. 24

క. ఘనులవ్వని శౌనక ముఖ, మునివరు లత్యంత మోదమునఁ బుణ్య కథల్
వినుచుండి రోమహర్షణ, తనయుని గని యనిరి వినయ తత్పరులగుచున్. 25

ఆ. మునివరేణ్య నరుఁడు మును సుభద్రాసతీ, మణిని బెండ్లియైన మహిత చరితఁ
దెలుపవలయు మాకు దృఢమతినన నాతఁ, డెలమి వారికిట్లు దెలుపఁదొడగె. 26

మ. వెలయున్ సర్వ పురాధి రాజములలో విఖ్యాతమై యొక్క ప్రోల్
బలభిద్రత్న వినూత్న కాంచన కనత్ప్రాసాద కేళీ కళా
కలనా కౌశల కామినీ ముకుర శంకాకారి రాకా నిశో
త్పలినీ బాంధవ మండలం బవని నింద్రప్రస్థ నామంబునన్. 27

క. ఆ పుర మురువైభవ జిత, గోపురము మణీ నిబద్ధ గోపుర మిలకున్
నూపురము కలిమి చేడియ, కాఁపురమున్నట్టి నెలవు గణుతి యొనర్పన్. 28

మ. తొవరాఁలాల కడాని మేడల తుదిం దోరంబుగా నాడు రా
నవలా మిన్నలు మిన్ను గేళకుళిలో నాళీక నాళచ్ఛటల్
తివురొప్పారఁగ గోసి మేపుదురు హాళిం గేళి హంసాళికిన్
భువనాతీత విచిత్ర వైభవములం బొల్పారు నవ్వీడునన్. 29

చ. మొలక పసిండి జీనిపని ముత్తెపు మేడల యందు బ్రోఁదలై
కులుకుదు రాత్మ నాయకులఁ గూడి శ్రమంపడి యున్న పిన్న రా
చెలువల గుబ్బచన్గవలఁ జిప్పిలు చెమ్మటలార్చు స్వర్ధునీ
జలజ సుగంధ గంధిల విశంకట మందర గంధవాహముల్. 30

చ. మెఱుఁగు కడాని బంగరపు మేడల రేల్విహరించు చేడియల్
బిఱబిఱఁ జెంతనున్న శశిబింబము గాంచి నిజాస్య లక్ష్మి ని
త్తఱి హరియింప డాకొనిన తస్కరుఁడంచును ముష్టి ఘట్టనల్
మఱిమఱి జేయఁ జంద్రునకు మచ్చ ఘటిల్లెను నాఁటి నుండియున్. 31

సీ. మదగజంబులు సానుమద్రవ్యజంబులు గాఁగ విమలాశ్వములు తరంగములుగాఁగ
జన పరంపర జలజంతు సంతతిగాఁగ లలనలు విద్రుమ లతలు గాఁగ
సౌవర్ణ సౌధముల్ సైకతంబులు గాఁగ దేవతా భవనముల్ ద్వీపములుగఁ
దూర్య నాదములు నిస్తుల ఘోషములు గాఁగ నీల భిత్తికలు శైవాలములుగ
తే. హీర సోపానపంక్తు లహీన ఫేన, పుంజములు గాఁగఁ ద్రిభువనాద్భుత సమగ్ర
వైభవంబున ననయంబు వఱలువారి, రాశి చందంబు పూని యా రాజధాని. 32

ఉ. హాటక దివ్యరత్న ఘటితావృతమై దివితోడ రాయు బ
ల్కోట వెడంద కొత్తడవు కొమ్మల నిమ్ముల విశ్రమింత్రు మి
న్నేటి తరంగ మాలికల నీఁదుచుఁ గ్రీడలు సేయు ఖేచరీ
పాటల గంధులా రుచిర పట్టణ రాజమునం దజస్రమున్. 33

సీ. అంభోధి శయను బాహాంతరంబును బోలెఁ బ్రతిదిన కమలాధివాసమగుచు
నమరావతీ పట్టణాధి రాజముఁబోలె ననిమిష సంచార హారి యగుచు
వనరుహాయత ముఖీ స్తనభాగమును బోలె మకరికా విభ్రాజమాన మగుచు
విపుల దాన నిరూఢ నృప సభాస్థలిఁ బోలె కవిరాజ సద్వచః కాంతమగుచు

తే. భూరి దిఙ్మండలముఁ బోలె పుండరీక, కుముద రంభాసమానమై కమలభవుని
సదనమును బోలెఁబరమహంసవ్రజాళి,రామమై ప్రోలి ఖేయాంబురాశి దనరు. 34

శా. జంభారాతి కరాగ్రజాగ్ర దురు వజ్ర క్రూర ధారాహతిన్
స్తంభీభూతములైన భూమిధరముల్ సమ్యక్తపో నిష్ఠచే
నంభోజాసను వేఁడి వజ్రకుధ భూషావాప్తి నత్యుజ్జ్వల
త్కుంభీంద్రాకృతు లూని తత్పుర నరేంద్రుం గొల్వఁ బోలుంజుమీ. 35

క. అయ్యారే పురి వార్వము, లొయ్యారం బెనయ ఖురపుటోద్ధ పరాగం
బియ్యెను ఘోటకములపైఁ, గయ్యానకుఁ గాలుదువ్వ కరణిం జెల్లున్. 36

గీ. సభలఁదన రాణి ప్రోదయై సంచరించి, తనకుఁ బొగడికదెచ్చెఁగా కెనసి చూడ
జలజ సంభవుఁడేపాటి చదువుకాఁడ, టంచుఁదెగడుదు రప్పురి యగ్రభవులు. 37

క. సర్వజ్ఞ శిఖామణు లరి, గర్వ విదూరులు తమోవిఖండనులు కళా
ధూర్వహులు వసు సమన్వితు, లుర్వీజను లలర రాజు లొప్పుదురు పురిన్. 38

గీ. ధనము బుధులకునిడి పేరుగనినమేము, ధనదులముగాక యొకమూలఁదన ధనంబు
దాఁచుకొనెడు కుబేరుఁడే ధనదుఁడంచుఁ, గేరుదురు మాటికవ్వీఁటి యూరుభవులు.

మ. హల మే ప్రొద్దు భుజాగ్ర పీఠమునఁ గాయల్ గాయఁగా మోఁచి యు
త్కలికం ద్రిమ్మరుఁ గాని, కాని పొలముం దాదున్ని పండించెనే
మొలకుం దెల్లని బట్ట గానమ యిసీ ముప్ప్రొద్దుఁగల్ ద్రావు నా
హలి యంచున్నిరసింతు రందు నయ భాగ్యాకర్షకుల్ కర్షకుల్. 40

గీ. కమల రాగాధరలు నీలకచలు హీర, రదలు మౌక్తిక నఖరలు రమ్య విద్రు
మాంఘ్రులు సువర్ణ విగ్రహలచటి వార,సతులు మణిమయ కాంచన ప్రతిమలౌర.

సీ. తమనెమ్మొగముల చెల్వము గనునివి యను సరణిఁగమ్మని తమ్మి విరులొసంగి
తమ వాలుఁజూపులందము వూనునివి యను కరణిఁజక్కని నల్లగల్వ లొసఁగి
తమ వాతెఱల సొంపు దాలుచునివి యను జాడ నాడెంపు దాసనము లొసఁగి
తమ దంతపంక్తి చందముజెందునివి యను పొలుపునఁగుందకుట్మలము లొసఁగి

గీ. తమ నఖర నాభి నాసా పదముల కొమరు
గాంచు నివి యనుక్రియఁ గేతకములుఁ బొన్న
పువులుఁ జంపకములును జెందొవలు నొసఁగి
విటుల నలరింత్రు పుష్పలావికలు వీఁట. 42

సీ. తమ మొగంబులు సరోజములంచుఁజేరి నాసలు చంపకములంచు జరగుతేంట్లఁ
తమ కెంబెదవులు బింబములంచు జేరి మైసాంకవంబున కుల్కి చను శుకములఁ
దమ రోమలతలు నాగములంచుఁజేరి కన్బొమలు విండ్లని పాఱు నెమలిగములఁ
దమ కరంబులు పల్లవములంచుఁజేరి కొప్పులు మొగుళ్ళని యోసరిలు పికములఁ

గీ. గాంచి కిలకిల నవ్వుచుఁ గనక కంక, ణారవంబులు చెలఁగ బిట్టార్చి పులుఁగు
మొత్తములఁదోలుదురు పాంథచిత్తములు చ,లింప నాప్రోల శాలిపాలికలులీల. 43

క. ఆ నగరమేలు మేలుగ, మానిత కీర్తి ప్రతాప మహిమోన్నతుఁడై
దీనజనావన రతుఁడై, దానకళా మహితుఁడగుచు ధర్మజుఁ డెలమిన్. 44

సీ. సర్వసర్వంసహా ధూర్వహతా ధృతకరి కిరి హరిగిరి కచ్ఛపుండు
బహుకులాచల శిలాఫలకాగ్ర భాగ వినిక్షిప్త జయ శాసనాక్షరుండు
తత నిరంతర దాన ధారాప్రవాహానిశ ప్రపూరిత సప్త సాగరుండు
చండ భండన సముద్దండ విక్రమ కళాఖండితాహిత రాజ మండలుండు

గీ. జైత్రయాత్రావసర వినిస్తంద్ర రణద,ఖండ భేరీ ధణంధణత్కార ఘోర
వీర కాహళ కారావ విచలితాష్ట, హరిదిభేంద్రుండు పాండవేయాగ్రజుండు. 45

సీ. కువలయావన కళా కుశలుఁ డింతియకాని వివరింపఁ జక్ర విద్వేషి గాఁడు
సతత సన్మార్గ సంచారి యింతియకాని రూపింప దోషాకరుండు గాఁడు
బుధజన ప్రియకరాభ్యుదయుఁ డింతియ కాని శోధింప గురు విపక్షుండు గాఁడు
వర్ణిత పరిశుద్ధ వర్ణుఁడింతియ కాని గణుతింప మలిన లక్షణుఁడు గాఁడు

గీ. భళిర యీతఁడు రాజుగాకిల నొకండు, రా జగుట కెట్లు దగునని రహిని సుకవి
రాజులును రాజులును బుధరాజులెన్న, రాజిలెడు ఠీవి నా ధర్మరాజు దనరు. 46

సీ. చెవిచెంతఁ గ్రూర ద్విజిహ్వ కోటులగూర్చి బ్రహ్మ హింసనబుద్ధిఁ బ్రబలఁదేని
దుర్వర్ణ భూమి భృత్కూటంబులను గూడి యుగ్రుఁడై ప్రజఁ ద్రుంపకుండె నేని
పఱచు వాహినిగూడి పౌరుషంబఱచెడి తిప్పలఁబడి తూలి తిరుగఁడేని
విసము కుత్తుకఁబట్టి వేడి చూపొదవంగ ధర్మ విఘాతియై తనరఁడేని

గీ. యభవునకు రాజశేఖరుఁ డనెడు పేరు
తగుఁగద యటంచుఁ గవి బుధోత్తములు సారెఁ
దన మహారాజ శేఖరత్వము గణింపఁ
దనరెఁ జిరభోగ సురరాజు ధర్మరాజు. 47

గీ. ప్రాణికోటుల దండించు బాళియెఱుఁగఁ,డెపుడు మారకులగు బంట్ల నేలఁబోడు
గురు గదాన్వితుఁడై మూల గుంటుపడఁడు, నిర్మలాచార శీలుఁడౌ ధర్మరాజు. 48

గీ. ఆ మహీపాలమౌళికి భీమ విజయ
నకుల సహదేవు లనఁగ నున్నత బలాఢ్యు
లఖిల బుధ బంధు రక్షణోపాయ విదులు
నలువు రనుజన్ములశ్రాంత నయులు గలరు. 49

క. ఆ నలువురు తమ్ములుఁ దన,యానతి దప్పక సమస్త హరిదంత ధరి
త్రీనాథ సమితి గెలిచి య,హీన పదార్థములు దెచ్చి యియ్యఁగ నెమ్మిన్. 50

సీ. హారిప్రభాపూర హీర సోపానంబు నీలజాలక జాల లాలితంబు
వైదూర్య విరచిత వలభికా నికరంబు విద్రుమస్తంభ ప్రవిస్తరంబు
ఘనతర పుష్యరాగ ద్వారబంధంబు గోమేధికావృత కుట్టిమంబు
విమల గారుత్మత వేదికా రుచిరంబు పద్మరాగ కవాట బంధురంబు

గీ. స్వచ్ఛ ముక్తాఫలచ్ఛటాచ్ఛాదనంబు
నగుచు వెలుఁగు సభాగృహాభ్యంతరమున
సకల బుధ బాంధ వామాత్య సహితుఁ డగుచుఁ
గడcక నొకనాడు పేరోలగమున నుండి. 51

గీ. తన పురోహితుcడైన ధౌమ్యునియనుంగు, ననుఙు కొమరుని సకల విద్యావిశార
దుని విశారదునీక్షించి యనుపమాన,మృదుమధుర వాక్సుధాధారలొదవcబలికె. 52

క. ధరణీసుర ద్వారకపురి, కరిగి జనార్ధనుని గాంచి యందఱి సేమం
బరసి నిరాతంక గతిన్, సరగున రమ్మనుచు సెలవొసంగిన యంతన్. 53

మ. చని యాభూమి బుధుండు గాంచె నెదురన్ సంప్రీత చేతస్కుఁడై
ఘన గంభీర జలాంతరాళ చలదుగ్ర గ్రాహ నక్రోడమున్
ఖనటద్భూరి ఝుళంఝుళారవ వలత్కల్లోల నిర్నిద్రమున్
జన హృద్యాపర దిక్సముద్రము సరిత్సంయోగ నిశ్ఛిద్రమున్. 54

సీ. ఘనుల కపార జీవనమొసంగెడు దాత మర్యాద దప్పని మాన ఘనుcడు
బహుతర కవిరాజ పాలనశీలుండు సతత మహోన్నత చక్రవర్తి
యురు మహీభృత్కోటి కునికిపట్టగు మేటి మణికంకణోర్మికా మానితుండు
వర్ధమానానంత వాహినీ సహితుండు భువనాభిరామ విస్ఫురిత కీర్తి

గీ. యీ రసాధీశ్వరుండాత్మ నెన్న బాడ,బా్రశయుండగుటేమి చోద్యంబటంచు
నెంచుచు ధరామరోత్తముండేగి భవ్య, సరణి నల్లన ద్వారకాపురము జేరి. 55

సీ. వలపు గొజ్జఁగి నీటి సెలయేటి గమిదాఁటి ఘనసార కదలికా వనులు గడచి
చలువ చెంగలువ బావుల క్రేవవిహరించి దాకఁజందిరి చాల్పు దరుల నిలిచి
బలితంపు నెత్తమ్మి కొలఁకుల కడడాసి పొదలు క్రొవ్విరి మల్లె పొదలు దరిసి
గుజ్జు లేమావి మ్రాఁకుల నీడ వసియించి గున్న సంపెఁగతోఁట గుంపు లొరసి

గీ. పారిజాత మహాపాదపచ్ఛటా ని,రంతరోద్యాన వాటికాభ్యంతరేందు
కాంతమణిపీఠికాగ్ర భాగములమెలఁగి, ద్వారకాపుర ఘంటాపథమునఁజనుచు. 56

సీ. కనక నిర్మిత శతాంగములు నిరీక్షించి యల మేరు శిఖరంబులని తలంచు
మత్త ద్విరదరాజ మండలంబులు చూచి యంజనాహార్యంబు లనుచు నెంచుఁ
జంద్రకాంతోపల సౌధముల్ గనుఁగొని హరగిరి కూటంబులని గణించు
బహుళ సమున్నత ప్రాకారములు గాంచి ఘనచక్రవాళాద్రు లనుచు నెన్ను

గీ. దివ్య మాణిక్య దీప్తి దేదీప్యమాన
దేవతాగార గోపురాదికము లరసి
రోహణ క్ష్మాధరములని యూహసేయుఁ
బ్రవిమలానంద హృదయుఁడై బ్రాహ్మణుండు. 57

గీ. అట్లు పురవీథిఁజని మురహరుని నగరు, చొచ్చి మోసలనిల్చి యచ్చోట నొక్క
చారు నీక్షించి తనరాక శౌరికెఱుఁగఁ,జెప్పుమని పంప నతఁడేగునప్పు డవల. 58

సీ. బహురత్న దీప ప్రభాభాసమానంబు కనక పంజర శారికా శుకంబు
పటుతర రతిబంధ బంధుర ప్రతిమంబు గోమేధికోజ్జ్వలత్కుట్టిమంబు
ధళధళత్కాంతి నిర్మల తరాదర్శంబు కస్తూరికా గంధ గంధిలంబు
ఘనవీటికా పేటికాజాల రమ్యంబు హిమవారి పూరిత హేమకలశ

గీ. మతుల సౌరభ్య సంవాసితాభ్ర పారి,జాత భూజాత కుసుమ సంఘాత రచిత
హరి శృంగార మహితశయ్యాతలంబు, నగుచు సొగసీను కేళీగృహాంతరమున. 59

చ. జిగిబిగి పట్టుపట్టె నునుజీని తలాడయుఁ బ్రక్కదిండ్లు సొం
పగు విరిపాన్పు పూసురటి యాకు మడుంగు లొసంగుచుం గడున్
సొగసులు గుల్కు కుందనపు సూత్రపు బొమ్మలు గ్రాల లీల మే
ల్పగడపుఁ గోళ్ళ దోమతెర బంగరు మంచము మీఁద వేడుకన్. 60

సీ. కనక కంకణ ఝణత్కారంబు వెలయంగ భోజకన్యక పదాంబుజము లొత్త
నిద్దంపు తెలి మించుటద్దంబు కైఁబూని నిలిచి సాత్రాజితి నీడ చూపఁ
జరణ మంజీర నిఃస్వనములు చెలఁగ జాంబవతి మాణిక్య చామరము వీవ
బెడఁగు క్రొందెలియాకు మడుపులు గొని మిత్రవింద నున్గపురంపు విడెమొసంగ

గీ. లీల భద్ర సుదంత కాళింది లక్ష్మణయును మొదలగు వరపద్మ నయనలూఁడి
గములుగావింప సుఖగోష్ఠిఁగ్రాలుచుండెఁ,బృథుయశఃస్ఫూర్తి గోపాలకృష్ణమూర్తి. 61

గీ. అపుడు చారుఁడు హరిచెంతకరిగిమ్రొక్కి, దేవ పాండవులనుప భూదేవుఁడొకఁడు
వచ్చి మిముదర్శనముసేయ నిచ్చఁగోరి,యోర్మిదనరార మొగసాల నున్నవాఁడు. 62

క. అని విన్నవించుటయు న,వ్వనజ దళేక్షణుఁడు శయ్య వైళము డిగి స
య్యన భూసురవరు చెంతకుఁ, జని వినయం బెనయ మ్రొక్కి సరసత మీఱన్. 63

ఉ. ఆ మహినిర్జరాన్వయ సుధార్ణవ పూర్ణ విభావరీ చరున్
బ్రేమ మెలర్పఁ దోడుకొని పెంపలరం దన దివ్య కేళికా
ధామము సొచ్చి యచ్చట నితాంత హరిన్మణి భద్రపీఠికం
దామరసాయతాక్షుఁడు ముదంబున నిల్పి సపర్యలిచ్చుచున్. 64

క. విప్రవర పాండుసుతు లిం,ద్రప్రస్థ పురంబునందుఁ బ్రాభవలీలన్
సుప్రీతి నున్న వారలె, క్షిప్రంబున మాకుఁ దెలియ జెప్పఁగ వలయున్. 65

ఉ. సేమమె ప్రాజ్ఞగాస్తనగ సేతు హిమాచల మధ్యభాగ భా
గ్భూమితలేంద్ర మస్తక విభూషణ దివ్య సరోజ రాగ ర
త్నామల దీప్తి దీపిత పదాంబు రుహాభిగతాభి యాతికిన్
సామజ ఘోటకప్రముఖ సాంద్ర విభూతికి ధర్మసూతికిన్. 66

క. సామజ హయ రథ భట ము,ఖ్యామిత చతురంగ బల సమన్విత రిపురా
డ్భీమునకున్ భీమునకున్, సేమంబు గదయ్య విప్రశేఖర చెపుమా. 67

క. దుర్జన రిపురాడ్భయద మ,హోర్జిత విక్రముఁడు నృపజనోత్తముఁడు నయో
పార్జిత విమల యశుండ,య్యర్జునునకుఁ గుశలమే ధరామర వర్యా. 68

క. కుల కుధర సదృశ ధృతి భా,స్కులకు మహా శిశిర కిరణకుల జలధి శశాం
కులకుఁ బ్రతాపార్కులకు న,కుల సహదేవులకు మిగులఁ గుశలంబు గదా. 69

క. కాంతాజన రత్నము ల,శ్రాంత మహా ధర్మమతులు జననుత చరితల్
కుంతీ ద్రుపద తనూజలు, సంతసమున నున్నవారె జగతీ దివిజా. 70

గీ. నావుడు విశారదుఁడు వల్కె నలిన నయన
తావకీన కటాక్ష వీక్షావిశేష
మహిమ నచ్చోట వారు సేమమున నుండి
మిమ్ము నరయంగ నిటకుఁ బంపించినారు. 71

క. నీ వనితలకును నీకున్, రేవతికిని హలికి రోహిణికి దేవకికిం
బావన గుణుఁడగు నవ్వసు,దేవునకున్ భావుకంబె త్రిదశేంద్ర నుతా. 72

ఆ. నారదాది మౌని నాయకుల్ గనలేని, నిన్నుఁజూడఁ గంటి నేఁడు సకల
పాపములు నశించె భాగ్యరేఖ లభించె, సంతసించె మది యనంత రూప. 73

క. నీ మహిమ మెన్నఁ దరమె పి,తామహ సుత్రామ శైల తనయాధిప ము
ఖ్యామర వరులకునైనం, దామరస దళాయతాక్ష దనుజ విపక్షా. 74

వ. అని మఱియు నిట్లని వినుతింపం దొడంగె. 75

ర. జయ రమా కుచకుంభ కుంకుమ సాంకవాంకిత నిజ భుజాంతర
భయద వక్ర నిరుద్ధ యూథప పాలనాతి కృపా నిరంతర
నంద గోప కుమార సనక సనందనాది మునీంద్ర పూజిత
మందరోద్ధరణైక కారణ మాననీయ యశో విరాజిత
భోజకన్యా విమల హృదయాంభోజ మత్త మిళింద నాయక
రాజమాన మహో తపోధన రాజ శశ్వ దభీష్ట దాయక
రాధికా మధురాధ రామృత రస ఝురీ పరిపాన కౌశల
సాధు సజ్జన సముదయావన సార కరుణా పూర పేశల
భానుకోటి విభావిభాసిత భవ్య కౌస్తుభ మణి విభూషణ
ధేనుకాసుర దర్ప హరణ సుధీజన ప్రియ మృదుల భాషణ
సతత వితత పిచండ మండిత సరసిజాత భవాండ మండల
అతుల పంకజ రాగ మణిమయ హారి నూతన మకర కుండల
మకర కేతన దర్పణ ప్రతిమాన మానిత మృదు కపోలక
వికట శకట ఖరాదికాసుర వీర ఘోరస్మయ విభాళక
వల్లవీ పరిరంభ సంభ్రమ వర్ధమాన సమగ్ర కౌతుక
మల్లయుద్ధ కళా విజృంభణ మథిత చాణూరాది ఘాతుక
లోకనాయక సత్యభామాలోల నీలా హృదయ రంజన
భీకరాహవ రంగ రంగత్పృథుబలాన్విత రిపు విభంజన

నిరుపమాన విహార నవ నవనీత చౌర్య కళా విశారద
హరిహయాశ్మ విభానిభా కలితాంగ రుగ్జిత నీల నీరద
మదన కోటి విలాస భాసుర మాలినీ మృదు హృదయ తస్కర
త్రిదశ పరివృఢ విభవ జాంబవతీ సతీ వదనాబ్జ భాస్కర
కాళియాహి ఫణోపరిస్థల కల్పితాసమ లాస్య ఖేలన
నీల పరిధాన ప్రియానుజ నిత్య సజ్జన భక్త పాలన
దేవ దేవ మహేశ కేశవ దేవకీ వసుదేవ నందన
పావనాంగ విలిప్త దివ్య జవాదికా మృగనాభి చందన
దివ్య పరిమళ మిళిత యమునా తీర నీపవన ప్రచారణ
భవ్య నిజ చరణాబ్జ సేవక పటల దుష్కృత భయ నివారణ
వాసుదేవ ముకుంద మాధవ వరద నారాయణ జనార్దన
వాసవార్చిత కృష్ణ మురహర వనజనాభ సురారి మర్దన
ధరణిధర ధర విపుల బాహాంతర నిరంతర విలసదిందిర
తరణి హిమకర నయన దామోదర మహా వైకుంఠ మందిర. 76

వ. అని వినుతించి వెండియు నిట్లనియె. 77

గీ. దానవాంతక వినుము నీ మేనమఱంది, యర్జునుఁడు మిమ్ము దర్శింప నాత్మఁగోరి
యొరిమనువ్విళులూరుచు నున్నవాఁడు, వచ్చునతఁడింతలోన నీవంక కెలమి. 78

క. గోత్రారి ముద్దు కొమరుఁడు, శత్రునిషూదనుఁ డపార సౌందర్య కళా
గాత్రుఁడు మీ కృపకాతఁడు, పాత్రుండు గదయ్య పరమ పావన చరితా. 79

క. నరనారాయణులను ముని,వరు లిపుడర్జునుఁడు నీవు వసుధా తలముం
బరిపాలించుట కొఱకీ, కరణిం బ్రభవించినారు కద యదు తిలకా. 80

ఆ. అనిన సంతసిల్లి హరి యమ్మహీసుర, వరున కమిత దివ్య వసన కనక
మణి విభూషణాది మహిత సువస్తువుల్, చాలనొసఁగి సెలవొసంగుటయును. 81

క. ముప్పిటిగొను కౌతుకమున, నుప్పొంగుచు ధారుణీ సురోత్తముఁ డచటన్
గుప్పున దరలి సుఖోన్నతి, దప్పక తన మొదలి రాజధానికిఁ జనియెన్. 82

వ. చని తనరాక కెదురు చూచుచున్న ధర్మరాజుం బొడఁగాంచి యిట్లనియె. 83

క. మనుజేంద్ర నీదు పంపునఁ, బనిపూని రయంబ ద్వారవతి కేగి ముదం
బున నందొక దివ్య నికే,తనమున శృంగారలీలఁ దళుకొత్తంగన్. 84

సీ. అలతి చెందొగ విందునందుఁ గందును బోలె నొసల కస్తురి రేక పసఁబొసంగఁ
దటిమొగుల్ తెగయందు మెఱఁగుదీఁగెయుఁబోలి మేనబంగరుశాలు మెఱఁగులీన
తొలిమల తుదయందు నలిన బంధుఁడువోలెఁదల మణిమకుటంబు చెలువుమీఱ
రత్నవేదిక యందు రంగవల్లులు వోలె నెద ముత్తియపుఁ బేరు లెమ్మె నెఱప

గీ. కటక కంకణ ముద్రికా కనకకుండ, లాద్యలంకారములు తద్ద హరువు చూప
సత్యభామాది పట్టంపు సతులఁగూడి, యొఱపు రాణింప శుభలీల నున్నవాని. 85

సీ. తెలిదమ్మి తేకులఁ దెగడు కన్నులవానిఁ దొగవిందునగు ముద్దు మొగమువాని
మించుటద్దము మించు మెఱఁగుఁజెక్కులవానిఁ గొదమతేఁటుల గిబ్బకురులవాని
చిగురుటాకులఁబోలు చేయి దమ్ములవాని గురు కవాటము గేరు నురమువాని
గజతుండముల నెన్ను భుజదండములవాని బింబోపమా నాధరంబు వాని

గీ. నవ్య చంపక ముకులాభ నాసవాని, కంబు నీకాశ రుచిర గళంబువాని
హరిహయ శిలాకలాప దేహంబువాని, భావజ విలాసు శ్రీకృష్ణ దేవుఁగంటి. 86

వ. అట్లు గనుంగొని సముచిత ప్రకారంబున. 87

గీ. ఎలమి నతనికి మీసేమమెఱుఁగఁజెప్పి, యతని సేమంబు దిటముగ నరసి దివ్య
వసన మణిభూషణాదులవ్వనజనాభు, చేతఁగొనివచ్చినాఁడ మీచెంతకిపుడు. 88

క. ఓ తేఁడ వినుము నెయ్యము, మీఱఁగ నయ్యదు విభుండు మీసేమము వే
మాఱు వెడందగ నడుగుచు, వేఱొందు తలంపులేక వినియెం జుమ్మీ. 89

ఆ. అనిన నుత్సహించి యాన్నపాలాగ్రణి, యతనిఁ గారవించి యనుచుటయు ర
యంబ యద్ధరామరాగ్ర గణ్యుఁడు దన, సదనమునకు సంతసమునఁజనియె. 90

వ. అని శౌనకాది మహర్షులకు రౌమహర్షిణి యెఱిఁగించిన వారలతని నవ్వలి కథా
విధానంబెట్లని యడుగుటయును. 91

మ. యమునా తీర నికుంజ సంజ వన నిత్యానంద కృద్రాధికా
రమణీ పీన పయోధర ద్వయ పరీరంభ ప్రసక్తాభ కుం
కుమ పాటీర మృగీ మదోల్లసిత వక్షోభాగ దాక్షాయణీ
రమణాంభోజ భవామరేంద్ర వినుత ప్రాజ్య ప్రభావోదయా. 92

క. అరి పృతనా సమవర్తీ, సుర సముదయ చక్రవర్తి సుగుణ స్ఫూర్తీ
శరదంబుద నిభ కీర్తీ, పరిహృత భువనార్తి పతిత పావన మూర్తీ. 93

మాలినీ. సజల జలద నీలా శాత కుంభోరు చేలా
త్రిజగ దవన శీలా దీన మందార సాలా
కుజన కుల విభాళా గోపికా కేళి లోలా
వృజిన హరణ మూలా వేణు గానైక లీలా. 94

*ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపానిరీక్షణ సంలబ్ధ సారకవితావిచిత్ర*
*కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర*
*సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ నామధేయ*
*ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను*
*శృంగారరస ప్రబంధంబునందుఁ*
*ప్రథమాశ్వాసము*

# ద్వితీయాశ్వాసము

శ్రీమత్పురుషోత్తమ పుర, ధామ సమిద్ధీమ దనుజ దర్పవిరామా
ధీమజ్జన నుత సుగుణో, ద్దామ జగన్నాథ నామ దైవలలామా. 1

వ. అవధరింపుము శౌనకాది మహర్షులకు రౌమహర్షణి యిట్లని చెప్పందొడంగె నట్లు విశారదుండు ధర్మరాజు చేత ననుజ్ఞాతుండై తన గృహంబున కరిగి మఱునాఁడు సవ్యసాచి కడకుంజని మంతనంబున నతనితో నిట్లనియె. 2

ఆ. పార్థ ధర్మజుండు పనుప ద్వారక కేగి, భూరితేజుఁడైన శౌరిఁ గాంచి
వారి సేమమెల్ల నారసి పిదప మీ, సేమమెల్ల నెఱుఁగ జెప్పుటయును. 3

వ. అమ్మహా ప్రభుం డమందానంద కందళిత హృదయారవిందుండై యనేక ధన కనక మణి భూషణాంబరాదికంబులు నాకొసంగి పుత్తెంచిన వచ్చి ధర్మరాజున కా కుశల వృత్తాంతం బెఱింగించితి నింక నొక్క విశేషం బెఱింగించెద నాకర్ణింపుము. 4

క. ఆ కృష్ణప్రభు సోదరి, రాకా మిహికాక రాభిరామానన భూ
లోకాతీత గుణాన్విత, ప్రాకట రుచి నలరుఁ గద సుభద్ర యనంగన్. 5

క. రాజకుల తిలక వినుమా, రాజముఖీ మణినిఁ బొగడ రాదింతయు నా
రాజీవ భవులకైనను, రాజీవభవునకు నైన రాజస లీలన్. 6

సీ. చిలుకల కొల్కి ముద్దులగుమ్మ వన్నెల గని యపరంజి బంగరు సలాక
తలిరుజొంపపు మావి వలిగప్పురపు దిమ్మ కులుకు మిటారి రంగుల కొటారు
వలపుగస్తురి లప్ప తొలుకరి క్రొమ్మించు కమ్మగొజ్జెఁగ బంతి తమ్మి కొలను
తళుకు వజ్రపుబొమ్మ తెలుముత్తియపు గోవ పగడపుదీవ సోయగపు వాఁక

గీ. కడిది వెన్నెలనిగ్గు చెంగలువ బావి, చికిలి క్రొమ్మించు టద్దంబు పికిలిచెండు
నాగ నలరారు నయ్యెలనాఁగ బాగు, పొగడ నలవియె వేనోళ్ళ ప్రోడకైన. 7

ఉ. దాని ఘనాఘన ద్యుతి వితాన సదృక్కబరీ మరీచికిన్
దాని ధళత్తళ త్తనులతాతి తతాభినుత ప్రభాళికిన్
దాని ధగద్ధగద్రుచి నితాంత విరాజ కపోల పాలికిన్
మానవనాథ యెట్టి దృఢమానసులైనఁ జలింప కుందురే. 8

మ.రతిరాజోజ్వల మోహనాస్త్రము రమారామా తనూజాత సం
చిత లోకాద్భుత జీవనౌషధము రాజీవాంశుగారామ సం
స్థిత దివ్య ప్రసవాభ సౌరభ మిళద్దేవద్రురాజం బహో
శతపత్రాయత చారు నేత్రc బొగడన్ శక్యంబె యెవ్వారికిన్. 9

గీ. సరసిజాతాక్షి కీల్జడ చక్రికైన, నంబుధరవేణి లేcగౌను హరికి నైన
ముగుదముద్దుమొగంబు సోమునకునైన,గణుతియొనరింప శక్యంబుగాదుసుమ్మి. 10

సీ. సకియ ముద్దుమొగంబు చంద్రబింబమెసుమీ నెఱీదృక్చకోరముల్ నిలిచియుండె
తరుణి చన్గుబ్బలు తమ్మిమొగ్గలె సుమీ చూచుక భ్రమరముల్ సొంపు నెఱసె
వనజాక్షి పొక్కిలి వల్మీకమె సుమీ రోమలతా భోగి రూఢిజాగె
బాలికామణి వేణి నీలాంబుదమె సుమీ శృంగార రసవృష్టి చిలుకcదొడcగె

గీ. నహహ మనుజేశ యత్తలిరాకుబోcడి, సారసౌందర్యమమర భుజంగ యక్ష
గరుడ గంధర్వ కిన్నరాంగనలకైన, ఖచర వరవర్ణినులకైనc గలదె చెపుమ. 11

క. నడమందము సైకపు నె,న్నడుమందము తేటిదాటునకు దీటగు కీ
ల్జడ చందము తద్దయు నె,వ్వడజిందము దెగడు గళము వఱలుంజెలికిన్. 12

సీ. చంద్ర విస్ఫురణంబు సన్నగిల్లcగcజేయు నెలcత నవ్వును మేను నెమ్మొగంబు
సారంగములc దిరస్కారంబుగావించు మెలcతచూపులు నడల్ మెఱుcగుcదురుము
చక్రంబులను భంగసరణి గ్రిం దొనరించుc బొలcతి గుబ్బలు కటి పొక్కిలియును
హీరంబులc గరంబు నీసడింపగc జూచుc గలికి పల్చాలును గౌను నాఱు

గీ. నవనినాయక యా భువనాద్భుతాభి,నవ విలాస కళా సమున్నతి దనర్చు
చెలువ నరుదుగ నిరుదుగ తలలుగలుగు, వలcతికైనను గణుతింప నలవిగాదు. 13

శా.ఔరా సౌరలరారు కొప్పు చెలి కొప్పారుం బయోభృత్సునా
సీర ప్రస్తర శైవల భ్రమరికా శ్రీలన్ విడంబించి మ
జ్జారే సారె విసార సారస తటిత్సారంగ భృంగాంగ భూ
నారాచోత్పల కైరవోత్కరము నెన్నంజాలు దృగ్జాలముల్. 14

గీ. కమల మయ్యింతి ముద్దుమొగంబుc దొడరెc
గెలువc జాలక రేకెత్తి దళము లెల్ల
విచ్చుటయు నీరజంబయి పిచ్చలించి
తరుణి యడుగులు వట్టుక తరలకుండె. 15

ఉ. చందురు నందుఁ గందు జలజాతములందు రజోవికారముం
జెందఁగ ముద్దొనర్చి సరసీరుహ గర్భుఁడు లోఁగృశించి యా
నింద మఱల్పుకోఁ దలచి నేరుపుతో నకలంకమైన యా
సుందరి ముద్దు నెమ్మొగము చోద్యముగా సృజియింపఁబోల్ జుమీ. 16

సీ. ఉవిద కన్బొమలకు నోడి సింగిణి విండ్లు వడివంగి శరమూని యడలఁజొచ్చె
సకియ నాసకునోడి సంపెంగ పూమొగ్గ విచ్చుమొగ్గైపోయె గచ్చుదరిగి
చేడె పల్వరుసకు నోడి వజ్రపు ఱాలు పుడమి నదృశ్యమై యడఁగియుండె
యువతి కెమ్మోవికి నోడి తామర కెంపు బిట్టుత్రాసంబూని చట్టు పడియె

గీ. జలజముఖి వీనులకునోడి చక్కిలములు, పలుదెఱంగుల సడిఁగన బడఁగ నలిఁగె
లోనుపడియుండె నయ్యారె లోకులెఱుఁగ,నధిప చెలిసోయగంబెన్న నలవిగాదు. 17

క. ముకురాభ వదన చెక్కులు, ముకురంబులఁ గరము దవిలి మూయఁగఁ జేయున్
సకియ గళముదరముల ను,త్పుకుత మెయిం దెల్ల పుచ్చి సుడివడిఁ జేయన్. 18

గీ. రతి మనోభవ కేలికారామపూత
లతలు సతిబాహువులు కిసలములు పాణు
లసమ సాయక కాసారబిసము లతివ
భుజము లంభోజములు శయంబులు నృపాల. 19

క. చెండ్లున్ మేలిమి బంగరు, గిండ్లున్ గజనిమ్మ పండ్లు గీర్తింపఁగ బల్
గుండ్లున్ వనితామణి పా,లిండ్లకు సరిగావు గద మహీవర తిలకా. 20

ఉ. పొక్కిలి కల్గునన్ వెడలి పొంకపుఁ గెంజిగురాకు మోవి ను
న్జక్కెర లప్పకై సరవి జాగి పథంబున నున్న గుబ్బ చ
న్జక్కవదోయిఁ గాంచి చనఁజాలక నిల్చిన చీమచాలు నాఁ
జక్కెర బొమ్మ యారు విలసద్గతి మీఱు ధరా పురందరా. 21

ఉ. నిద్దపు జాలువా పసిఁడి నిగ్గుల నెమ్మెయి తమ్మి కెంపుల
న్ముద్దు జొకారపుం దొగరు మోవి మదావళ కుంభ పాళిచేఁ
దద్ద బెడంగు జన్గవయుఁ దానొనరించి విధాత యద్దిరా
దద్దెర మెల్లఁ గూర్చి వనితామణి నెన్నడు మెట్లొనర్చెనో. 22

క. జలధి తరంగావళు ల, ప్పొలఁతుక వళులను జయింపఁబూని జడత్వం
బలరారె నెగసి పడుచుం, బలుమారు గడంగి భంగపడి యడఁగెఁజుమీ. 23

సీ. కలకంఠ శుక శారికల ధాకలకు లోగు కొదమ తుమ్మెద చాల్పు రొదకు వీగు
వలినాలి గాడ్పుబోఁదల సోకులకుఁదూలుఁ జలువ చెంగలువ తావులకు సోలుఁ
గలువ యనుంగు వెన్నెల కాకలకుఁ దారు వలపు బన్నీటిదాఁకలకుఁ దారుఁ
దలిరుగ మావి మోఁకలకు బెగ్గిలి కుందుఁ దెలిగప్పురపు బూది కళుకు జెందు

గీ. నాతతస్ఫీత బలమనోజాత శాత, చూత జలజాత విశిఖ సంఘాత ఖాత
యాతనాధూత చేతోంబుజాతుఁడగుచు,భూతలాధీశుఁడిడుమలఁబొరలుచుండు. 39

మ.వడియున్ బ్రాసము నుజ్జగించి కపట వ్యాపార మేపార నె
ప్పుడుఁ గీడౌ నపశబ్దముల్ పలుకుచున్ భూరిప్రియాలంకృతుల్
సడలంజేసి పదార్థ వాంఛ యొక పజ్జన్ లేక దుర్లక్షణం
బడరం గాకవి రీతినుండె మతిలే కచ్చో సభాదూరుఁడై. 40

క. ఇవ్విధమునఁ గవ్వడి యా, జవ్వనిపైఁ దలఁపు నిలిపి జాలియొసంగం
బువ్వు విలుకాని బాధలఁ, గ్రొవ్విరి లోలోనఁ గంది కుందుచునుండెన్. 41

గీ. అక్కడ సుభద్రయును దమ యన్నమ్రోల, నక్కజంబుగ విజయుని చక్కఁదనము
విప్రపుంగవుఁడెఱిఁగింప వినిమనమున,నాశుభాకారు వరియించు నాసఁదవిలి. 42

ఉ. ఎన్నఁడు చూతునేను ద్రిదశేంద్ర కుమార రమాకుమారులం
గిన్నర రాట్కుమారునిఁ బ్రకృష్ట మనోహర రూప రేఖచే
బన్నము నొందఁ జేయఁదగు భవ్యతరాకృతి వాని నిద్దపుం
బున్నమ చందమా మనగఁ బూను ముఖాబ్జము వానిఁ గవ్వడిన్. 43

శా.ఆ రాజన్య శిరోవతంసము సముద్యత్ప్రీతి నన్ గౌఁగిటన్
గారామారఁగఁ గూర్చి పేర్చు నెలమిం గందర్ప కేళీకళా
ధౌరంధర్యము మీఱ నేలుకొన సద్యస్సౌఖ్య లీలాపయః
పారావారము నందుఁ దేలెడు మహా భాగ్యంబు నాకబ్బునే. 44

ఉ. అరయ నాదు దివ్య మణిహార మహా రజత ప్రసక్త భూ
షా రుచిరాంబరాదులును సార పటీర తుషార నీర కా
శ్మీర మృగీమదాగరులుఁ జిత్ర నికేతన వీటికాదులుం
గోరఁగ నేల యా నృపతి కుంజరు నెయ్యము గల్గకుండినన్. 45

క. ఎన్నఁడిటు వచ్చు నర్జునుఁ, డెన్నఁడు ననుఁ బెండ్లియాడు నింపొదవఁగ న
న్నెన్నఁడు కౌఁగిటఁ జేరుచు, నెన్నఁడు నాకోర్కి దీర నెనసి సుఖింతున్. 46

ఉ. ఆ లలనా మనోజుఁడు సమాదర లీలల నాగళంబునన్
మేలిమి తాళిబొట్టు రహిమీఱఁగఁ గట్టి సుపాణి ముత్తెపుం
బ్రాలు శిరంబుపై సురుచిరంబుగ నించిన యేని గట్టురా
చూలికి నోలిఁ బూజలిడి జోత లొనర్చి కడంకఁ గొల్చెదన్. 47

ఉ. అద్దిర నాకు వాని నెనరబ్బక యున్నఁ గడింది జాలిలో
దద్ద వెడందయై పొదవి దర్పక బాణ పరంపరార్తిచే
నెద్దొసఁగుల్ ఘటిల్లునొ మహీజను లేమని యెంతురో కదే
సుద్దులకేమి తమ్మిపువు చూలి తలంపెటులున్నదో కదే. 48

ఉ. అవ్విభు చెంతకేగి వినయంబున నా తెఱఁగెల్లఁ దెల్పి రా
నెవ్వరి వేఁడుకొందు నటులేగి యనుంగులు విన్నవించినన్
నవ్వుల బెట్టి యయ్యువని నాయకుఁడెగ్గుగ నెంచునేమొ కా
దవ్వుల వార్తలేడ వనితామణు లేడ బెడంద లేట్టికిన్. 49

సీ. ప్రియమార్గ మలరార బిరబిర నచటికా నేలవేల్పుల పెద్ద యేల వచ్చె
వచ్చి యచ్చెఱువుగా విచ్చలవిడి నా సురేంద్రసూతి యొయార మేల తెలిపెఁ
దెలిపిన నలరి యెంతే కూర్మి మెరయ నా హృదయ మాతని మీఁద నేల తవిలెఁ
దవిలిన తెఱఁగు మంతనమున నొరులకు నెఱిఁగింపఁబోవ సిగ్గేల పొడమె

గీ. పొడముగాకేమి యమ్మేటి పొందు నాకుఁ
గలుగు కొఱకెట్టి మున్నతికల మెలఁగిన
మెలఁగఁదగుఁ గాక యహహ యీ వలపు నిలుప
నలవియె యటంచు మఱియు నన్నలిన నయన. 50

మ. కలయంగోరుఁ గవుంగిలింప దివురుం గాసిల్లుఁ గన్మూయు బె
గ్గిలుఁ గెంగేల్ నునుఁజెక్కు నందిడు దిశల్ గ్రేగంట నీక్షించు వె
ల్వెలఁబోవున్ బయలాలకించు వగచున్ వేసారు దూపిల్లు నొఁ
దలయూఁచుం బలవించు నుస్సురను వంతంగుందు నెంతేనియున్. 51

క. అద్దము గన్గొని నొసలన్, దిద్దదు కస్తూరి రేఖ తినదన్నంబే
కొద్దిగ నేనియుఁ గంటికి, నిద్దుర గానదు విడెంబు నెరిగొన దెపుడున్. 52

చ. చిలుకలఁ గొట్టు నెచ్చెలులు చెంతకు వచ్చినఁ దిట్టు నూరకే
కిలకిల నవ్వు నంచలను గించు కరంబున రువ్వు శారికల్
పలికినఁ గుందుఁ దుమ్మెదల పాటలకుం దిగులొందు నద్దిరా
చిలుకల కొల్కి యబ్బురపుఁ జిత్త వికారము లెన్నఁ జిత్రముల్. 53

సీ. కలఁగు మత్తమయూర కలహంసకా కీర కలకంఠ కంఠ హుంకారములకు
మలఁగు నానాసూన మకరంద రసపాన ధావన్మధువ్రతా రావములకుఁ
దలఁకుఁ జందన శైల తట సమాగత బాల మంద గంధానిలా స్పందములకు
నులుకు శీతమయూఖ విలసిత కిరణౌఘ సాంద్ర చంద్రాతపా సారములకు

గీ. తలఁగు నుద్దండ పటుగజా దండనిహిత, చంద్రపుండ్రేక్షు కోదండదండ గళిత
రతిమనోహర ఘోరనారాచములకు,మిగులమదినోడి యమ్ముద్దుచిగురుఁబోఁడి. 54

క. అటులర్జునుఁడు సుభద్రయుఁ, బటుతర మోహాంధకార పరవశత మెయిం
గటగటఁబడుచుండిరి హృ, త్పుటముల నుద్వాహకాంక్ష పొరిఁబొరి బెరయన్. 55

ఉ. అంతట నొక్కనాఁడొక ధరామర వర్యుని గోవుఁ దస్కరుల్
సంతస మొప్పఁ దోలుకొని చయ్యన నేగిన నాతఁడెంతయున్
వంత గలంగి శీర్షమును వక్త్రము నుమ్మడి మోఁదుకొంచు న
క్కుంతికుమారు మేడ కడఁ గుయ్యిడినన్ విని తత్తరంబునన్. 56

ఆ. మేడ డిగ్గ నుఱికి క్రీడి విప్రుని డాసి, యతని మాటలెల్ల నాలకించి
వెఱపు మాన్చి పాండవేయాగ్రజుని మేడ, కేగి విల్లు నమ్ము లెలమిఁ గొనియె. 57

మ.కొని యా చోరులఁ ద్రుంచి బ్రాహ్మణునకున్ గోవున్ సమర్పించి గొ
బ్బున నేతెంచి కృతాంతు సూతికి నతుల్ పొల్పారఁ గావించి తా
మును నెయ్యంబునఁ జేసికొన్న నియమంబుం దెల్పి యొక్కొండు దా
బనిమీఁదన్ ధరణీ ప్రదక్షిణ మొనర్పం బోవఁ బ్రార్థించినన్. 58

క. ధర్మజుఁ డర్జునుఁ గనుఁగొని, నిర్మల మతిఁ బలికె నిట్టి నియమంబులు దు
ష్కర్ములకుఁగాక సదమల, ధర్మ విచారులకు నేల తత్త్వజ్ఞ నిధీ. 59

ఆ. గో ప్రదక్షిణంబు సుప్రీతిఁ జేసిన, గోప్రదక్షిణం బగుం గదయ్య
యట్లు సేయుమనిననతఁడు విన్నంబోయి,పలికె మృదులమధుర భాషణముల. 60

ఆ. అన్న ధర్మరాజ మున్ను తీర్థాచర,ణంబు సేయు బుద్ధి నాకుఁ గలదు
కార్య కారణములు గడునేకమయ్యె ని,త్తఱిని దనకు దాని దైవగతిని. 61

క. కావునఁ దీర్ఘాచరణము, గావించి రయంబ వత్తుఁ గ్రన్నన సెల వి
మ్మా వలదని పలుకక యని, వేవేల విధముల మ్రొక్కి వేఁడిన నతఁడున్. 62

గీ. సమ్మదమునొంది యపుడు విశారదుండు,మొదలుగాఁగల విప్రోత్తములను బరిజ
నములగొందఱిఁ దోడిడి సముచిత ప్ర,కారమునఁబల్కి దీవించి కౌఁగిలించి. 63

క. పొమ్మని యానతి యొసఁగిన, నమ్మనుజాధీశ మణికి నభివాదనముల్
గ్రమ్మఱ నొనరిచి బంధు జ,నమ్ములచే నాజ్ఞగొని మనంబలరారన్. 64

క. కుంతికిని భీమసేనున, కెంతయు సద్భక్తి మ్రొక్కి యెలమిఁ గవలకున్
సంతస మొదవఁగఁ బలికి ని,జాంతఃపురి వెడలెఁ బరిజనాన్వితుఁడగుచున్. 65

గీ. అవ్విధంబున ధర్మరాజానుమతిని, దగిన హితబంధు తైర్థికోత్తముల తోడఁ
గూడుకొని క్రీడి గడితంపు వేడుకలర, భూప్రదక్షిణ మొనరించు బుద్ధినరిగి. 66

చ. సురుచిర లీలఁ గన్గొనియె శోభన దివ్య సరోజ మాలికా
పరిమళ లాభలోభ మదబంభర డింభ రవానుషంగ దు
ర్భర దురితౌఘ భంగ నతిభాస్వర గాఢ తరంగ రంగ దీ
శ్వర మకుటాగ్ర రంగ శుభ సంగను గంగఁ దగంగఁ జెంగటన్. 67

క. కనుఁగొని హర్షాద్భుతములు, మనమునఁ బెనఁగొనఁగ నికటమహిఁజాగిలి వం
దనము లొనరించి మృదుకర, వనజంబులు మౌళిఁజేర్చి వడి నుతియించెన్. 68

క. అంగజహర మకుటాంతర, రంగా విమలాంతరంగ రంగత్తుంగా
భంగతరంగా వృతచ, క్రాంగా నతి సేతు నన్ను నరయుము గంగా. 69

ఆ. అవ్వ నిన్ను దవ్వు దవ్వులఁ బొడఁగన్న, ముక్తి కల్గునఁట యమోఘ భంగి
నీట మునుఁగు ఫలము నేనెఱుంగను సుమీ, దివ్యతర తరంగ దివిజ గంగ. 70

క. జ్వాలాభీలానల యుత, హాలాహల మారగించి హరుఁడటు సోలన్
నీ లలితామృత లేశము, మౌళి పయిం జిలికి యతని మనిచితివి గదా. 71

శా. నీ తీర ద్రుమకోటరాంతర చరన్నీడోద్భవ శ్రేణులున్
నీ తోయాశ్రిత మత్స్య కచ్ఛపములు న్మించున్ నిజేంద్ర సం
ఘాతారోకిత ఘంటికా ఘణఘణత్కారాతి భీతాహిత
వ్రాతాంభోజ ముఖీ జనస్తుత మహా రాజన్య కంటెన్ సతీ. 72

శా.నీ నీరంబులఁ దోఁగు మానవుఁడు నిర్నిద్ర ప్రభావంబునన్
నానా కల్మష కోటి మీటి దివిషాన్నారీ జనోపేతుఁడై
యానంద ప్రద రత్న కీలిత విమానారూఢుఁడై స్వర్గ భో
గానూన స్థితి నుల్లసిల్లుఁ గద గంగామంగళాంగీ మణీ. 73

క. అని కొనియాడుచు నన్నది, మునుకలు గావించి దానముల విప్రతతిం
దనియించి తత్తటంబున, ఘనతర మౌనమున జపము గావించు నెడన్ 74

గీ. సరగ నచటి కులూచినాఁబరగునొక్క, యురగ కన్యక నెమ్మది నరుగుదెంచి
నరుఁగనుంగొని తన్మనోహరవిలాస, విభ్రమములకుఁగడు మనోవీధి యందు. 75

ఉ. అబ్బురమొంది చంద్రుఁడొ జయంతుఁడొ కంతుఁడొ యవ్వసంతుఁడో
లిబ్బుల రాచపాపఁడొ భళీ యితఁడారయఁ గాకయున్న నీ
నిబ్బరపుం జగా సొగసు నెక్కొన నేర్చునె వీని తొమ్మునన్
గుబ్బలు గ్రుచ్చి హెచ్చరికఁ గ్రుమ్ము లతాంగిదె భాగ్యమెన్నఁగన్. 76

చ. తొగరు మెఱుంగు వాతెఱయుఁ దోరపు క్రొవ్విరి దమ్మి తేకులన్
నగఁదగు కన్నుఁదోయి పులినంబుల గేరు పిఱుందు నందమున్
సొగసులు గుల్కు పెన్నెరులు చొక్కపు ముద్దు మొగంబు గల్గు నీ
జగమగనిం గనుంగొనిన చాన విరాళిఁ గలంగ కుండునే. 77

ఉ. చక్కెర వింటిదంట నెకసక్కెము లాడు గదయ్య వీని మేన్
చక్కదనంబు నెన్నడుము సౌరు గలంచు గదయ్య సింగముం
జెక్కుల పెక్కు తీరు పడఁజేయుఁ గదయ్య మెఱుంగు టద్దము
న్మక్కువ వీని కౌఁగిటఁ బెనంగెడు భాగ్యము నాకుఁ గల్గునే. 78

ఆ. వీని మోవి తేనె లాని చెక్కుల ముద్దుఁ, గొని మిటారి గబ్బిగుబ్బ గవ ను
రమ్ము గ్రుమ్మి నెమ్మి కమ్మవిల్తుని కేళి, నెనయకున్న వయ సిదేల నాకు. 79

క. అని మిగుల మున్నరికె నా,తని నెత్తుక వేగ బఱచి తన కేళి గృహం
బున నునిచిన నవ్విజయుఁడు, గనువిచ్చి కడంది మీఱఁ గని యుల్లమునన్. 80

సీ. నవనవ కిసలయోన్నత రసాలమువోయి మినుకు బంగరుమేడ మెఱయుటేమి
యక్షుద్రమణి సైకతాగ్ర భాగము వోయి చలువ క్రొన్నన పాన్పు మలయుటేమి
నిస్తంద్ర కల్లోల నికురంబములు వోయి రేరాచ రా మెట్లు గూరుటేమి
పరిపుల్ల జలజాత పరిమళంబులు వోయి కమ్మకస్తురి తావి గ్రమ్ముటేమి

గీ. యౌర నే మున్ను సురసరిత్తీర భూమి
నున్న యది లేదొ కలగంటినో మరేమి
మాయయో కాక యిది యంచు మఱలిచూచు
నవసరంబున నరిది యొయార మెనయ. 81

చ. తలుకు పసిండి బొమ్మయొ సుధాకర రేఖయొ మించు దీవయో
చిలుక పతాణి తేజి దొరచేతి నిగారపు నిల్వుటద్దమో
వెలగనరాని మానికమొ వెన్నెల తేటయొ నాఁదనర్చు లేఁ
గులుకు మిటారి నొక్క మదకుంజర గామినిఁ గాంచెఁ జెంగటన్. 82

గీ. కాంచి దాని మనోహరాకార రేఖ, కద్భుతంబంది యౌర యియ్యంగనా ల
లామ మారుని సామ్రాజ్యలక్ష్మియనఁగఁ,బరఁగుచున్నది కన్నులపండువగుచు. 83

ఉ. చూడమె చెప్పఁగా వినమె శోభనకాంతి యుతాంగులైన యీ
రేడు జగంబులందుఁ గల యిందు నిభాస్యల వారలెల్ల నీ
చేడియ మేలుబంతి కెన సేయనొకింతయుఁ బోలనేర్తురే
వేడుక యయ్యెఁబో మదికి వేమఱు నీ మదిరాక్షిఁ జూచినన్. 84

ఉ. కన్నుల చెన్ను నెమ్మొయి నిగారము చెక్కుల పెక్కు మోము గో
మన్నులికొను జాను మొగమందము వేనలి బాగు గుల్కు లేఁ
జన్నుల నీటు ముత్తరుల సొరు వెడంద పిఱుందు చందమ
న్నన్న కడిందియై మదికి నత్యనుమోదము గూర్చె నియ్యెడన్. 85

క. అని కొనియాడుచుఁ జెంతం, గనుపట్టు నొయారిఁ గలువ కంటింగని య
య్యనిమిష రాజతనూభవుఁ, డెనలేని మనోనురాగ మెనయఁగఁ బలికెన్. 86

ఉ. ఎక్కడి దానవీవు హరిణేక్షణ యీ జగమెద్ది నీవు న
న్నిక్కడి కేల తెచ్చితి విదేమిటి యోజ దృఢవ్రతస్థులై
దిక్కుల వెంబడిం జను విదేశుల నిట్లొనరింపఁ బాడియే
యక్కట బేలనై యురక యారడిఁ జెందుట మేలె చెప్పుమా. 87

గీ. అనిన నప్పొఁపరాజవరాలు రాచ, మిన్న తిన్నని నిడుసోగ కన్నుదోయి
దేలఁ గన్గొని యోసుదతీ మనోజ, వినుము నాచందమంతయు విన్నవింతు. 88

గీ. ఈ జగంబు రసాతలం బే నులూచి, యను భుజంగమరాజ కన్యకను నీ వి
లాసగరిమంబుగాంచి యుల్లాసమొదవ, నిన్ను వరియింపఁగోరి బల్మున్నరికల. 89

క. ఇటఁ దెచ్చిన దాన విశం, కట కరుణాలోకనమునఁ గన్గొని నను నె
క్కటి వలరాచ దురంబునఁ, బటుగతి నలరించి ప్రోవు ప్రమదం బెసఁగన్. 90

గీ. అనుఁడు నుడు రాజముఖి కిట్టు లనియెఁ గ్రీడి
భూతలం బేడ భుజగేంద్ర భువన మేడ
తరుణు లెచ్చట మఱియన్య పురుషు లెచట
నహహ యీదుండగం బేల యహిప బాల. 91

క. మోహావేశంబున నెడ, రూహింపఁగఁ బరుని గోరు టుచితమె నీ కి
ట్లాహా మేల్మే లెంతటి, సాహసురాలవె భుజంగ సారస నయనా. 92

గీ. కాముకుఁడుగాక వ్రతమూని భూమిఁదిరుగ,నేమమునఁబోవు నన్నిట కేమిపనికిఁ
బ్రేమమునఁ దెచ్చితిది మేరయే మనోజ్ఞ, సోమబింబోపమానాభిరామ వదన. 93

గీ. నయమున విధిజ్ఞులైనట్టి నరపతులకుఁ, బరవధూమణి నెనయంగఁ బాడియగునె
బేల యీరిత్తకోర్కి నీకేల యనిన, భావము గలంగి యప్పూప పాఁపపాప. 94

చ. కనుఁగవ నశ్రుబిందువులు గ్రమ్మఁగ గద్గద కంఠయై మొగం
బునఁగడు విన్నబాటొదవ ముప్పిరి గొన్నవలవంతఁ బల్కె నో
జనవర చంద్ర యో నయవిశారద యో జనరంజనైక శో
భనతర రూప యో ఘనకృపా యిటు లానతిడంగఁ జెల్లునే. 95

గీ. కన్నియనుగాని వేఱొండుగాదు నీకు, జన్నె యిడియుంటి నాయెల జవ్వనంబు
ప్రాణరక్షకు మిగులఁ బుణ్యంబు గలదె, నీ వెఱుంగవె సత్కృపానిధి వధీశ. 96

గీ. మానవాధీశ యిఁకఁ బెక్కు మాటలేల, ఘోరమార కిరాత దుర్వార విశిఖ
శిఖిశిఖాయాతనలచేఁ గృశింపనీక, నీ కవుంగిటఁబొదవి మన్నించుమిపుడు. 97

గీ. అనిన మదిలోఁగరంగి యమ్మనుజవిభుఁడు, దానికెంగేలువట్టి పూపానుపునకుఁ
దార్చి స్మరశాస్త్ర నియతి విస్తరిల మదన, కేలికా సౌఖ్య జలరాశి నోలలార్చె. 98

క. అంతట నమ్మహికాంతుఁడు, కాంతాలోకైక చూళికా రత్నము న
త్యంత ముదంబునఁ గన్గొని, యింతింతనరాని కూర్మి నిట్లని పలికెన్. 99

గీ. రమ్ము ఫణిరాజకుల కరిరాజ యాన
యిచట నిఁక జాగొనర్చిన నచట తైర్థి
కావనీసురు లాత్మ నేమని తలంత్రు
పోయి వచ్చెద సెలవిమ్ము పొలుపు మీఱ. 100

ఉ. నావుడు విన్నబా టొదవ నాగ కులాంబురుహాక్షి వల్కె నో
భావజ రూప యో పరమ పావన యో రసికాగ్రగణ్య నిన్
బోవఁగ వద్దటంచు మదిఁ బొంగెడు కూరిమి తోడ నాడినన్
దేవర చిత్తవృత్తి యొకతీరుగ నుందునొ యేమి సేయుదున్. 101

క. ఎన్నడు చూతునొ నిను నా, కన్నుల కరవెల్లఁ దీరఁ గ్రమ్మఱ నిఁక నా
పన్న జనావన గుణసం, పన్నా ధీమత్ప్రసన్న ప్రభుజన మాన్యా. 102

శా.నీ చెల్వంబును నీ విలాసమును నీ నిర్నిద్ర తేజఁబు నీ
వాచా ప్రౌఢిమ నీ కృపాగుణము నీ వైదుష్య సామగ్రియున్
నీ చంచన్నయనాబ్జ వీక్షణము నీ నిత్య ప్రసన్నత్వమున్
నా చిత్తంబునఁ బాయఁజాలదు గదా నారీ లతాంతాయుధా. 103

క. నీకును నాకును నేస్తం, బీకరణిం గూర్పనేల యెడఁబాయఁగ నే
లా కట్టిడి దయ్యంబిఁక, వాకులు పెక్కేల విబుధ వర్ణిత శీలా. 104

ఉ. మల్లడిగొన్న ప్రేమమున మన్మథ రాజ్య సుఖైక లీలలం
బెల్లుగ నిన్నుఁ గూడుకొని పెక్కు దినంబులు వేడ్క నుంటి నే
నెల్లెడలందు నిన్నె స్మరియింపుచు నుందుఁ దలంపు జేసి నీ
యుల్లము నందుఁ జాల దయ యుంచుము రాజముఖీ మనోభవా. 105

గీ. అని పలికి కల్కిమేల్బంతి యతని నపుడె
మరల జాహ్నవి కడఁ జేర్చి మదిఁ బెనంచు
కూర్మి నక్కునఁ బొదవి కన్గొనల బాష్ప
కణము లురలంగఁ దనదు లోకమున కేగె. 106

గీ. అంతఁద్వైర్థిక హితభూసురాది జనులు, నృపతిరాకకుఁ గడునుత్సహింపుచుండి
రప్పుడు విశారదునిజూచి యర్జునుండు,పలికెనిట్లని యతిమృదుభాషణముల. 107

సీ. వింటె విశారద వింత యొకటి నేను జాహ్నవీ తటమున సంధ్య వార్చి
జపమొనర్చుచునున్న సమయంబునందు నులూచి యన్పన్నగ లోల నయన
యొక్కతె వచ్చి నన్మక్కువఁ దోడ్కొని చనితన కేళికా సౌధమునను
నిలిపి తన్గవయుమంచెలమితో బహువిధంబులఁ బ్రార్థనముచేసి మ్రొక్కుటయును

గీ. మగువ దీనతకెంతయు మదిగరంగి, దాని కోరిక సఫలంబుగా నొనర్చి
సమ్మతిలఁబల్కి క్రమ్మఱ సరగనిచట, కరుగుదెంచితి నెమ్మది యతిశయిల్ల. 108

క. ఆ చిల్వ చెల్వచెల్వము, వాచస్పతి కైన భోగి వరునకు నైనన్
బ్రాచుర్య గతి నుతింప న,గోచరమగు నితర జనులకుం దరమగునే. 109

చ. తళుకుఁ బసిండి బొమ్మ నెఱతావుల గొజ్జఁగి పూవుఁ గొమ్మ క
న్నుల విలుకాని తూపుజిగి నూల్కొను కాఱు మెఱుంగు కోపు వె
న్నెల నడుచక్కి తేట వెలనిచ్చిన బల్లతనంపు మూట యే
లలనలు దాని తోఁడుతఁ దులా? వితలాతల భూతలంబులన్. 110

ఉ. ఆ పెనుగప్పుకొప్పు సొగసౌ పువుచెండులఁ జెండు గుబ్బల
ద్దా పస మించు మించు తెగనాగి జయించు మిటారి చూపుకో
పౌ పుడమిం దమింబరమునట్టి పిఱుందు పసందయారె యా
పూప నిగారపున్ వయసు పోటుల చోటుల నెన్న నున్నవే ! 111

సీ. పెనుగప్పు నునుగొప్పు ననుగుప్పు విరితావు లరిజాలముల నామెతలకుఁ బిలువ
మగమీలఁ దెగఁజాల నగువాలు జూపులు చలదురు చూపులై జనులగాడ
బలుగుబ్బలుల గిబ్బు వలిగుబ్బ చనుదోయి సొబగు చూపర మదిచూరఁగొనఁగఁ
బగడాల జగడాలు దగనేలు జిగిమోవి యువజనంబులకు నోరూరఁ జేయ

గీ. సార సారంగ మదఘన సారగంధ, సారనీహార నీర కాశ్మీర భూరి
సౌరభంబులు దిశల హెచ్చరికఁబర్వ, నురగకులబాల నాగ్రోల నొరపునెఱపు. 112

గీ. వేయు నేటికి వినుదాని సోయగంబు, దానిఁబుట్టించినట్టి విధాత కైనఁ
బొగడరాదన్యులకునెట్లు పొగడవచ్చుఁ,జిత్తజునిపైఁడిబొమ్మయాచిలువకొమ్మ. 113

గీ. అనిన నందఱు సంతసంబంది యతనిఁ, బెక్కు తెఱఁగులఁగీర్తించి రక్కిరీటి
యనుచరబలంబుతోఁగూడి యచటఁదరలి,చనియెనెమ్మది నీహారశైలమునకు. 114

సీ. పటుబలోద్ధత ఘోర పంచాస్యనఖ శీర్యమాణ దారణ కుంభ మౌక్తికంబు
తతగుహాంతర నిరంతర చరద్భయదోగ్ర శార్దూల నికురంబ సంకులంబు
నిబిడ పాటీరద్రు నిష్కుహాంతర్లగ్న ఫణిఫణా మణి ఘృణి భ్రాజితంబు
ఘనఝరీ నినదాభ్ర గర్జాభ్రమామిత ప్రమద నృత్యన్మత్త బర్హిణంబు

గీ. సరస సంగీత విద్యాప్రసంగ రంగ, మాణ గంధర్వ యక్ష గీర్వాణ ఖచర
సుందరీబృంద పరివృత కందరంబు, పుణ్య గణ్యంబు నీహార భూధరంబు. 115

గీ. అన్నగం బెక్కి యచటి చోద్యంబు లెల్లఁ
గనుఁగొనుచుఁ గొంత తడ వచ్చటను మెలంగి
కదలి యంతఁ దదంతికాగస్త్య వట మ
హీరుహము గాంచి చనె భృగు శృంగమునకు. 116

గీ. అచ్చట హిరణ్యబిందు తీర్థావగాహ,నంబు గావించి విహిత దానము లొనర్చి
చనియెఁబరిజన తైర్థిక సహితుఁడగుచుఁ, బుణ్యకరమైన నైమిశారణ్యమునకు. 117

క. ఆరూఢ భక్తి నచ్చట, నారాయణుఁబూజ చేసి హరి పుణ్యకథా
సారామృత పానుండై, యా రాకొమరుండు చనెఁ బ్రయాగంబునకున్. 118

క. సంగాతులు దానును మదిఁ, బొంగుచుఁ గైదండలూని పొదవి త్రివేణీ
సంగమునమునిఁగి నతజన, మంగళనాయకుఁ బ్రయాగ మాధవుఁగొలిచెన్. 119

క. వారక తైర్థిక జన పరి,వారంబులఁ గూడి పెక్కు వారంబులు త
ద్వారి విహారము సలిపి య, వారణ నటఁ దరలి చనియె వారాణసికిన్. 120

సీ. మణికర్ణికా తీర్థ మజ్జనంబొనరించి గంగానదీ స్నాన కలనఁదనరి
లోలార్క ముఖులైన హేళుల దర్శించి కాలభైరవు మహాకాళుఁ గొలిచి
యాదికేశవుల నత్యామోదమున నెంచి బిందుమాధవ దేవుఁ బ్రేమఁగాంచి
శ్రీవిశాలాక్షి నక్షీణ భక్తి భజించి విశ్వేశ్వరస్వామి వినుతి చేసి

గీ. భూనుతములైన పుణ్యనదీ నదముల
స్నానములు దానములు హిత సరణిఁ జేసి
కోటిలింగ స్థలములు గన్గొని కడంక
దుంఠి విఘ్నేశుఁ బ్రమథరా ట్పుత్రుఁ బొగడి. 121

క. రయమున నచ్చో వెలువడి, గయకుంజని పితరులకుఁదగం బరలోక
క్రియలాచరించి గోధన, హయగజ దానముల భూసురావళిఁ దనిపెన్. 122

క. కుతుకమున నందు వెలువడి, కతిపయ దినములకుఁజేరి కనుఁగొనియె మహో
న్నత వితత శృంగభాగా, న్విత తులసీ కాననంబు నీల నగంబున్. 123

క. అంతట నింద్రద్యుమ్న స,రోంతరమునఁ దీర్థమాడి యతిగి సుభద్రా
కాంతుని జనసన్నుత గుణ,వంతు జగన్నాథు సాధువత్సలుఁ గాంచెన్. 124

క. కాంచి ప్రణమిల్లి తులసీ, కాంచన పుష్పములఁ బూజ కడుభక్తిని గా
వించి ప్రసాదములు సమ,ర్పించి నుతింపగఁ దొడంగె మృదు మధురోక్తిన్ 125

క. పరికింపఁ బతితపావన, బిరుద మెపుడు నీకుఁజెల్లుఁ బృథివీస్థలి నీ
సరియగు వేలుపులేరీ, నిరుపమ కరుణా నివేశ నీలాద్రీశా. 126

సీ. కమనీయ తపనీయ కౌశేయకము వాని దళదరవింద నేత్రముల వాని
సంపూర్ణ పూర్ణిమా చంద్రాననము వానిఁ గరతల శంఖచక్రముల వాని
బల సుభద్రాసతీ పరివృతుండగు వాని నీల మేఘాకృతిఁ గ్రాలువాని
నిరుపమ శృంగార నీరధియగు వానిఁ బతిత పావనుఁడనఁ బరఁగువాని

గీ. నఖిలలోకైక నాయకుఁడయినవాని, నిన్నుఁబొడగంటి శుభములు నెఱయఁగంటి
నీలనగవాస విబుధ వర్ణిత విలాస, శ్రీజగన్నాథ విజయలక్ష్మీ సనాథ. 127

ఉ. వాసవ ముఖ్య దిక్పతులవశ్యము గొల్చు భవత్పదాబ్జముల్
భాసుర లీలఁగంటి సులభంబగు మేల్గయికొంటి విచ్చెఁబో
చేసిన పాప సంఘములు చెప్పెడిదేమిఁక నాయదృష్టమో
దాస మనోరథార్థ ఫలదాయక నీలనగాధి నాయకా. 128

ఆ. శిఖర దర్శనంబు చేసిన మాత్రనె, తొలఁగుచుండు నఖిల దుష్కృతములు
నిన్నుఁజూచు పుణ్య మెన్న నేరితరంబు, నయవిలాస నీలనగ నివాస. 129

గీ. అని జగన్నాథుఁ గీర్తించి యచటఁ దరలి
మోద మిగురొత్త శ్రీకూర్మమునకు నేగి
నతజన శరణ్యుఁడగు కూర్మనాథుఁ గొలిచి
యటు వెడలి త్రోవఁ జనుచుండె నన్నరుండు. 130

క. అని శౌనకాది మునులకు, ననఘాత్ముండైన రౌమహర్షణి యెఱిఁగిం
చిన నాలకించి వారా,యన నవ్వలి కథయుఁ దెలుపుమని వేఁడుటయున్. 131

చ. సరసిజ పత్రనేత్ర మునిసన్నుతి పాత్ర చరిత్ర కల్మషో
త్కర లతికాలవిత్ర నిజదాస జనావన సూత్ర దుగ్ధ సా
గర తనయా కళత్ర మిహికాకర శేఖర మిత్ర వృత్రసం
హ రమణి జాల నీల జలదాంచిత గాత్ర విచిత్ర వైభవా. 132

క. పారావారాగారా, సూరిజనాధార మార సుషమాకారా
ఘోరాఘాభ్ర సమీరా, సారదయాపూర నీల శైలవిహారా. 133

మాలినీ. అతులిత గుణధామా హారి శృంగార సీమా
శతధృతినుత నామా సర్వలోకాభిరామా
క్రతుభుగవనకామా ప్రాంచదాకార కామా
దితినుతకులభీమా దేవతా సార్వభౌమా. 134

ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపానిరీక్షణ సంలబ్ధ సారకవితావిచిత్ర
కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర
సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ నామధేయ
ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను
శృంగారరస ప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము

**శ్రీరుచిర గుణనివేశా, దూరిత ఖలనాశ ఘోర దురిత వినాశా!**
**భూరితర నిజనివేశా, నీరేజ హిత ప్రకాశ నీలాద్రీశా.**

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలముని కు,లేంద్రులకు రౌమహర్షణి యిట్టులనియె
నట్లు తెరవునఁజనిచని యర్జునుండు, గాంచె ముందర నతితరోత్కంఠుఁడగుచు. 2

క. సింహాకారోజ్జ్వలము న్న, సింహాశ్రిత తలము కలుష సింధుర పటలీ
సింహాయిత జలము మహా, సింహావృత బిలమునైన సింహాచలమున్. 3

వ. మఱియు నమ్మహీధరంబు కైలాస కుధరంబునుం బోలె నీలకంఠావాసంబై మేరు శైలంబునుంబోలె నమేయ గైరిక ఛాయంబై వైకుంఠపురంబునుం బోలె హరి నిత్య వాసంబై బ్రహ్మలోకంబునుం బోలె పరమహంస సమావృతంబై యలకాపురమునుం బోలె నగణ్య పుణ్యజన శరణ్యంబై రసాతలంబునుం బోలె నాగేంద్రాక్రాంతంబై పాథోనిధానంబునుం బోలె నక్రాంత బాడబాశ్రయంబై త్రిదివంబునుం బోలె ననవరత రంభావిజృంభ మాణంబై మహారాజన్యు రాజ్యంబునుం బోలె నపరిమిత కటక వికంకటంబై సుకవి కావ్యంబునుం బోలె ననేక మత్తకోకిల వ్యాకులంబై నైమి శారణ్యంబునుంబోలె శుకముఖ ద్విజకులాలంకృతంబై యొప్పు నప్పర్వతవతంసంబుం గనుంగొని పరమానంద కందళిత హృదయారవిందుండై తదీయాధిత్యకారోహణం బొనర్చి యందు బహు సహస్రాదంభ శుంభ జృంభన్మణిస్తంభ సంభాసితంబును జంచత్కాంచన పాంచాలికా సంచయ సమంచితంబును నభ్రంకషోత్తుంగ శిఖ రావలంబి శాతకుంభ కుంభ గుంభితంబును మనోహారి హీరసోపాన వితర్దికావిటంక కుట్టిమ విరాజమానంబును గనత్కనక కవాటార్గళ ద్వారబంధబంధురంబును నవరత్న ఖచితోత్తాలసాల గోపుర ప్రాసాదమంటప ప్రదీపితంబును బరతత్త్వ విద్యాధురీణ పరమభాగవతోత్తమ నిపఠిత వేదనాద మేదురంబును సురూపలావణ్య గణ్య పణ్యాంగనా నృత్త గీత వాద్యధ్వాన మానితంబును హనుమద్గరుడ శేష విష్వక్సేన జయవిజయ ద్వాదశ సూరిజనాధిష్ఠి తంబును గౌశిక కాలాగరు కర్పూర సాబ్రాణికా

ధూపవాసనావాసితంబును సద్యో ఘృత కృత ప్రదీపదీపితంబును బహుళాపూప సూప పరమాన్న ఫల దధి మధు శర్కరాఘృతోపేత మహానైవేద్య హృద్యంబునునై రెండవ వైకుంఠధామంబును బోలి విరాజిల్లు శ్రీమద్వరాహ నృసింహదేవ దేవాలయంబుఁ బొడఁగని నమస్కరించి యంతట గంగధారాది చతుర్వింశతి ధారానీరంబులఁ గృతావగాహుండై తులాపురుషాది మహాదానంబు లొనరించి గర్భాగారంబుఁ బ్రవేశించి. 4

సీ. మేదినీతల గుప్త పాదద్వయమువాని విమల సంస్తబ్ధ కర్ణముల వాని
నవిరళ త్రివళి సమన్వితుండగు వానిఁ గమనీయ ధవళ విగ్రహము వాని
విస్ఫుటపటుసటా విలసింతుండగు వాని దంష్ట్రాకరాళ వక్త్రంబు వాని
మృదులాంస భాగ విసృష్ట వాలము వాని నంచిత నేత్రత్రయంబు వాని

గీ. లాలితోత్తాల భుజయుగళంబు వాని, సింహ శైలేంద్రు నిలయుఁడై చెలఁగువాని
శ్రీసమేతు వరాహ నృసింహ దేవుఁ, గాంచె నృపమౌళి కన్నుల కరవుదీఱ. 5

గీ. అట్లు గన్గొని సాష్టాంగమాచరించి, మాలతీ తులసీ మహామయ సుమములఁ
బూజగావించి గంధతాంబూల ధూప, దీప నైవేద్యములొసంగి ధృతినుతించె. 6

క. పూరుష హర్యక్ష సుధీ, వారావన దక్ష దివిజ వల్లభ పక్షా
ఘోరారి దనుజ శిక్షా, సౌరకృపావీక్ష సింహ శైలాధ్యక్షా. 7

క. నిను సేవించిన నరులకు, మునుకొని ఘనభోగ భాగ్యములు చేకుఱుఁ బో
సనకాది సకల సన్ముని, జన రక్షణ రంహ సింహ శైల నృసింహా. 8

మ. హరి నీవే గతి నా కటంచు మును ప్రహ్లాదుండు ప్రార్థించినన్
గరుడారూఢుఁడవై సమగ్ర కృప వేగన్ వచ్చి యబ్బాలకున్
బరిరక్షించిన మేటి వంచు నిను నేఁ బ్రార్థింతు నన్ బ్రోవుమీ
యరి మత్తద్విప సింహ వీర నరసింహా సింహ శైలాధిపా. 9

ఆ. అనుచు వినుతి చేసి యచ్చోటు నెడఁబాసి సకల తైర్థికాప్త జనులఁ గూడి
కురువరుండు విహిత గోష్టి మార్గమువట్టి యరిగి కతిపయ ప్రయాణములకు. 10

మ. కనె నభ్రంకష దేవతా భవన రంగస్థాన నృత్త క్రియా
ఘన సంరంభ విజృంభమాణ దివిషత్కాంతా నిభాకార భూ
ప్రణుతాగణ్య విలాస గణ్య గణికా పంచాస్త్ర కేళీ కళా
త్యనుమోదాంచిత హృత్సరోరుహుని దాక్షారామ భీమేశునిన్. 11

క. కని సాష్టాంగ నమస్కృతు, లొనరిచి పూజించి మిగుల నుపహారంబుల్
దనివి సన నొసఁగి యద్దే, వుని సత్కృప వడసి పాండవుండట కదలెన్. 12

ఆ. కదలి యంత మాతృ గమనాపహారిణి, యును సమస్త కల్మషోగ్ర భుజగ
ఖగ వరంబు నైన గౌతమి కేతెంచి, స్నాన దాన విధులు తమి నొనర్చి. 13

గీ. అమ్మహానది దాఁటి వైళమ్ము తరలి
కృష్ణవేణ్యాది శుభ తరంగిణుల యందు
మునిగి ముని గీయమానుఁడై జనవిభుండు
చనియెఁ గొన్నాళ్ళ కెలమి శ్రీశైలమునకు. 14

క. చని మల్లికార్జున స్వా, మిని బొడఁగని విమల భక్తి మీఱఁగఁ బూజల్
పొనరించి యమ్మహా దే,వుని మధుర వచోనిరూఢిఁ బొగడఁదొడంగెన్. 15

క. ప్రమదమున నన్నుఁబ్రోవుము, భ్రమరాంబా వదన కమల భవ్య పతంగా
శమ దమన మదవిభంగా, యమల కృపాపాంగ మల్లికార్జున లింగా. 16

సీ. ఓంకార రూపిణే పంకజాత భవాది నిర్జరార్చిత పాద నీరజాయ
గజచర్మ చేలినే త్రిజగజ్జనావన దక్ష కారుణ్య నిరీక్షణాయ
చిరసౌఖ్య దాయినే పురుహూత మణి సదృక్కమనీయ తర నీల కంధరాయ
పార్వతీ పతయే సగర్వ పూర్వామర పూర్వరాపహ భూరి భుజబలాయ

గీ. శమన శమనాయ శర్వాయ శాశ్వతాయ, శరధితూణాయ శంభవే శశిధరాయ
శయకురంగాయ పరిచిత శతమఘాయ, శైలభవనాయ తే నమశ్శంకరాయ. 17

గీ. అనుచు నుతినతులొనరించి యచట వెడలి
పరిహృతమహాంహు శ్రీయహోబల నృసింహుఁ
జేరి భజియించి యిష్టార్థ సిద్ధి వడసి
సరగ నంతట వేంకటాచలముఁ జేరి. 18

సీ. వివిధ రత్నస్తంభ విభ్రాజమానంబు మరకత మణికృత మంటపంబు
హీరశిలాబద్ధ భూరిసోపానంబు గోమేధికావృత కుట్టిమంబు
తతచంద్రకాంత వితర్దికా రుచిరంబు గురుతరాంబుజ రాగ గోపురంబు
పటుశాత కుంభ కుంభస్ఫురచ్ఛిఖరంబు నీలజాలక జాల లాలితంబు

గీ. దివ్య మాణిక్యదీప్తి దేదీప్యమాన, లిప్తచామీకరోజ్వల ద్వారబంధ
వరణ వప్ర వరేణ్య కవాటవాట, మండితము వేంకటాద్రీశు మందిరంబు. 19

వ. అందు. 20

సీ. మహనీయ నవరత్నమయ కిరీటము వానిఁ గస్తూరికాతిలకంబు వాని
మకరకుండలదీప్తి మహిత శ్రుతులవాని దరహాస భాసి వక్త్రంబు వానిఁ
గౌస్తుభమణి విభాకలిత వక్షమువానిఁ గరతల శంఖ చక్రముల వాని
శతపత్ర పత్ర భాస్వన్నేత్రముల వాని భవ్య చామీకరాంబరము వాని

గీ. శ్రీమదలమేలు మంగ ప్రసిద్ధనామ, కామజననీ సమేతుఁడై హేమరత్న
సింహపీఠాగ్రమున విరాజిల్లు వాని, వేంకటేశ్వరు లోకైక విభుని గాంచె. 21

గీ. కాంచి పూజోపహారాదికముల దేవ, దేవు నలరించి యంత నత్తావు దరలి
కాళహస్తికి నేగి యక్కాలకంఠు, భక్త లోకాభిమత ఫలప్రదుని గొలిచి. 22

క. అచట వెలువడి దా నెమ్మి యలరఁగాంచి, కరిగి కరిగిరి నిలయుని వరదరాజు
నప్రమజన కప్రమఫలదు నేకామ్రనాథు, గురుతరానందుఁడై కొల్చి యరిగియవల. 23

శా. ఆమోదంబునఁ గాంచె నజ్జన విభుం దభ్రాధ్వభాగ్దేవతా
ధామాగ్రస్థిత హేమకుంభ విలసద్ధర్మాబ్జ దివ్యాంబుజ
వ్యామోహాగత మంజు గానరత లేఖాధీశ లీలా మహా
రామ క్ష్మారుహ సంచరత్సమద సారంగంబు శ్రీరంగమున్. 24

చ. కని యనవద్య భక్తి మదిఁగ్రాలఁగఁ బూజ యొనర్చెఁ గేతకీ
వనరుహ మల్లికాది కనక ప్రసవంబుల ధూపదీప చం
దనఫల శర్కరాదులఁ గనత్కన కాభర ణాంబరా ద్యుపా
యనముల సంతతాశ్రిత జనాభయ దాయకు రంగనాయకున్. 25

గీ. అట్లు పూజించి గొబ్బున నచటవెడలి, కుంభకోణంబునకుఁబోయి కొన్నిపూఁట
లందు వసియించి మఱి చంపకాటవీ ప్ర,దేశ మీక్షించి మెల్లన దెరవువట్టె. 26

సీ. చనిచని దక్షిణ జలరాశి వీచికా నిర్భర శీకర నికర తుంది
మందానిల స్పందమానాతి శీతల బంధుర సైకత భాగ వితత
సతత యాతాయాత సమధిక పథిక నికాయోరు కాయమానాయమాన
విలసదేలాలతా వేల్లిత క్రముకాది మహిజశాఖాంతర కుహర విహర

గీ. మాణ వివిధగరుద్రధ మధురమధుర, కలకలోద్వేల వేలాభిగత మనోజ్ఞ
మార్గమున నాప్తతైర్థిక వర్గసహితుఁ, డగుచు రామేశ్వరంబున కరిగియందు. 27

గీ. సేతు దర్శనమొనరించి కౌతుకమున, నెతి ధనుష్కోటిలోన మునింగి విహిత
దానముల భూసురావళిఁదనియఁజేసి, రామలింగంబుఁగొలిచి యారాజసుతుఁడు.

వ. అచ్చటం దరలి పదమూఁడవనెలం బాండ్యదేశాధీశ్వరుండగు మలయధ్వజుండేలు
మణిపురంబుఁ జేరి తత్పురోపకంఠ సముద్యదుద్యాన వాటి కాంతరంబున సుఖోప
విష్టుండై వినోదించు సమయంబున. 29

చ. పొలిచె వసంతకాలము ప్రఫుల్ల మనోహర మల్లికా విని
ర్మల మకరంద పానరత మత్త మధువ్రత మంజుగాన సం
చలిత వియోగినీ పథిక జాలము హృద్భయద ప్రచండ కో
కిల శుక శారికా రవ నికృత్త సమస్త దిగంతరాళమున్. 30

చ. అవని వనీవధూటి తమి నాడెడు నీలపు బంతిచాలు నా
నవిరళ లీల నప్పుడు వనాంగణ వీథిఁ జరించె నంచుగాఁ
బ్రవిమల మాధురీ మహిత బాలరసాల విశాల మంజరీ
నవనవమాకరంద రస నందిత మత్త మిళింద బృందముల్. 31

క. నవకుసుమ లసిత కింశుక, నివహంబులు చూడనొప్పె నెతినప్పుడు మా
ధవుఁడు వనలక్ష్మి కొరపుగ, సవరించిన పద్మరాగ సౌధములనఁగన్. 32

గీ. తతియనెడు మావటీఁడు మాధవవిభుండు, స్వారివేంచేయుచో నిడ్డచంచదరుణ
రాంకవాంకిత మదసింధురములనంగ, రమణఁబూచినశాల్మలిద్రుమములలరె. 33

సీ. పరిఫుల్ల మల్లికా ప్రసవ మరంద పానాలోల రోలంబ జాలకంబు
కలితామ్ర పల్లవ గ్రాసావ లేపాతిరేక కూజన్మత్త కోకిలంబు
మధుర ఫలాహార మాంసలవాచాల సమద సారీకీర సంవృతంబు
బహుకోశ మధురస పరిపాన లంపట సరఘా కులారావ సంకులంబు

గీ. సారఘనసార ధూళికా సాంద్రతర ప,రాగసమ్మేళనా నిశ భ్రామ్యదతి సు
గంధగంధిల మంథర గంధవహ వి,భాసురంబొప్పు మధుమాస వాసరంబు. 34

గీ. అలరువిల్కాఁడు పాంథుల గెలువఁబూని,స్వారివేంచేయగలఁడని సమయభటుఁడు
రమణ గట్టిన మణితోరణములనంగ,మ్రాకులందెల్లఁజిగురుజొంపములువిరిసె. 35

క. వనలక్ష్మీ మాధవులకు, ఘనతర విభవమునఁ బెండ్లి గావించుట కా
మని యిడ్డ కనకవేదిక, లనఁగాఁ గాఱాకుఁగుప్ప లలరెన్ వనులన్. 36

సీ. మాధవీ సుమబృంద మకరంద రసఝరీ హేలామదోద్వృత్తి సోలి సోలి
బాలానిలాలోల దేలాలతాజాల డోలా విహారాబ్ధిఁ దేలి తేలి
సార సౌరభ మిళత్పరిఫుల్ల మల్లికా వల్లికా తతులపై వ్రాలి వ్రాలి
లీల వలన్మహోత్తాల బాలరసాల సాల మంజరులపై వ్రేలి వ్రేలి

గీ. బాళి దైవారఁ జెంగల్వ కేళకుళుల, మేలికింజల్క రజమునఁ గ్రాలి క్రాలి
హాళిఁగేళీ మహారామ పాళులందు, నోలిఁగ్రీడించె సరస మత్తాళులపుడు. 37

సీ. మంజులగుంజానికుంజ సంజ వనాంతముల చెంత దాగుడుమూత లాడి
మహనీయ మంజరీ మహిత మాకంద శాఖలఁ గోఁతికొమ్మనగట్టి లాడి
యుల్లసత్సంఫుల్ల వల్లికా మల్లికా జాలకాగ్రముల నుయ్యాల లూఁగి
వికచ చంపక భూజవీధికాంతరములఁ బరిగొని నెరిఁ బారుపట్టె లాడి

గీ. మేలిపన్నీటి వాకల నోలలాడి, కమ్మగపురంబు బూదిపైఁ జిమ్ములాడి
లీలఁగ్రీడించె సరసవనాళులందు, మంద గంధ సమీరడింభకము లెలమి. 38

ఉ. ఎక్కడఁ జూచినం బికము లెక్కడఁ జూచినఁ గీర శారికల్
టక్కరి గండుతుమ్మెదలు డాగి హళాహళి సేయఁజొచ్చె నా
చక్కెర వింటి జోదు విరసంబునఁ బాంథులఁ జుట్టిముట్టె న
ల్దిక్కుల మూకలం బరపి దిగ్గన ముట్టడి వెట్టెనోయనన్. 39

క. అట్టియెడఁ జెలిమికత్తియ, లట్టియలై కొలువ మణిపురాధిపు ముద్దుం
బట్టి సురూప గుణంబుల, నట్టగు చిత్రాంగదాంగనా మణి కడకన్. 40

సీ. నిలుకడఁ గాంచి దిక్కులఁదళుక్కున నెమ్మె దీపించు క్రొమ్మించు దీవ యనఁగఁ
జెఱకు విల్కాఁడొఱ వెఱికి పాంథులమీఁద ఝళిపించు మోహనాస్త్రంబనంగ
రతి సతీమణి కేల నతికుతూహల లీలఁ బూనిన రతనంపు బొమ్మయనఁగ
నింగి దొఱంగి వన్నియమీఱఁ బుడమిపై మెలఁగు పెన్నెలరేని కళయనంగ

గీ. నలువ చెలువకొట్టము నుండి వెలుడి యొరపు
కదురఁ బొదలెడు రాయంచ కొదమ యనఁగ
నరిది సింగార మేపార హాళి నపుడు
వచ్చెఁ జెచ్చెర నుద్యాన వాటమునకు. 41

క. వచ్చి యనంగులుఁ దానును, విచ్చలవిడిఁ గ్రొంజిగుళ్ళు విరులుం బండ్లుం
గ్రచ్చుకొని తవిలి కోయం, జొచ్చిరి స్మరసైన్య భుక్తిఁ జూరగొను క్రియన్. 42

సీ. మధుమక్షికలఁదోలి మధురసంబులు గ్రోలి తలిరులు చిదిమి కోయిలల గదిమి
ఫలములురాల్చి రాచిలుక పొంజునదల్చి యలరులు ద్రుంచి తేఁటులఁ గలంచి
నీటులుపూని పన్నీటి వాకల నాని గొదగొని తారి పూఁబొదలఁ దూఱి
దాకపందిరులెక్కి తనియఁబండులు మెక్కి బడిబడిఁగ్రమ్మి పుప్పొడులు చిమ్మి

గీ. హోళిఁ జెలరేఁగి తీఁగెయుయ్యాలలూఁగి, కూటువలు గూడి ననచెండ్ల వ్రేటులాడి
కప్పురమురేచి ఘనసార కదళులూచి,చెలులు పుష్పాపచయకేళి సలిపిరపుడు. 43

గీ. కలికియొక్కతె కేతకీగర్భ దళము, గోయుటకుఁ గొమ్మవచ్చుచోఁ గుసుమరజము
వెకలి కన్నులఁగప్పినఁ జిమ్మటఁగొని, పుడమిఁజదికిలఁబడి బిట్టు బొబ్బరించె. 44

ఉ. బాలమృగాక్షి యోర్తు నవ పల్లవ సల్లలి తామ్రశాఖపైఁ
గే లటుసాచి కెంజివురు గిల్లిన నచ్చట డాఁగి యున్న మ
త్తాలస కోకిలంబు చిగురాకని ముక్కున నొక్కె నొక్కినం
దాలిమిఁ దూలి యుల్కిపడె దానిఁ గనుంగొని నవ్విరంగనల్. 45

ఉ. సంపెగ కొమ్మ వంచి యొక చంద్రనిభానన పూలుగోయఁగాఁ
జంపకగంధి యోర్తు గని సయ్యన దాని నదల్చి పాంథులం
బెంపరఁజేయు తుమ్మెదల పింఛమడంచు సుమంబు లేటికిం
ద్రుంపగఁ బోయితం చెడయఁ ద్రోచెఁ గరాబ్జము పట్టి లాగుచున్. 46

గీ. మొగలి విరిమీఁద మూఁగిన మొకరి తేంట్ల
నొక్క చెలి రేఁపుటయు నవి యొక్క పొలఁతి
మోము విరదమ్మి యని వెస ముసిరి దాని
నాస గని గంధఫలి యంచుఁ బాసి యుఱికె. 47

సీ. నిట్టూర్పుచే నొక్క నెలఁతుక వావిలిఁ జే నంటి యొక మందయాన మావిఁ
గౌఁగిటఁజేర్చి యొక్క లతాంగి గోరంట మాటాడి యొక హరిమధ్య గోగు
మోము చేరిచి యొక్క వామాక్షి సంపెంగఁ బుక్కిటిసుర నొక పొలఁతి పొగడఁ
దళుకుఁజూపుల నొక్క చెలి తిలకపు ద్రుమనుఁ జిన్ని నవ్వుల నొక్క కన్నె పొన్నఁ

గీ. బ్రేమతోఁబాడి యొకచేడె ప్రేంకణంబు, దాచి యొకలేమ కంకేళితరువరంబు
నలరులెత్తించి సరస విహారలీల, నలరుచుండిరి సంతసం బతిశయిల్ల. 48

గీ. అట్లు వనకేళిఁగావించి యబలలెల్లఁ, బూలుఁదలిరులు ఫలములుఁ జాల సంగ్ర
హించుకొనిఘర్మవారి వారించుకొఱకు,నంతజలకేళియొనరింప నదనుదలఁచి. 49

ఉ. ఆ రమణీ లలామము లుదంచిత లీలలఁ గాంచిరొక్క కా
సారము సార సౌరభ విశంకట సారస పుండరీక క
ల్హార మరంద హీన పరిలంపట మాద్యదళీంద్ర సాంద్ర ఝం
కారముఁ గోక హంస బక కచ్ఛప మీన ఝలీ కుళీరమున్. 50

గీ. అట్లుగని తత్తటంబున యందుమేలి, తొడవులును బుట్టములువెట్టి బెడఁగుగట్టి
పావడలుగట్టి శృంగముల్ వట్టి వారి, కేళిపై హాళిపుట్టి కేకిసలు గొట్టి. 51

క. పట్టుగల చంద్రకాంతపు, చట్టులచేఁ గట్టినట్టి సవరదనపు బల్
మెట్టుల వెంబడి డిగిచని, బిట్టుఱికిరి నీట గుభగుభీ గుభురనఁగన్. 52

వ. అట్లుఱికి. 53

సీ. నిగనిగలిగురొత్తు నగు మొగంబుల తోడ నిద్దంపు నిడుసోగ నెరులతోడఁ
గులుకు సిబ్బెపు గబ్బి గుబ్బచన్నులతోడఁ దళతళ లీను నేత్రముల తోడఁ
బసనించు వాటంపు బాహువల్లుల తోడ బంధురోన్నత నితంబముల తోడఁ
గమనీయ మృదుతర కర పదంబులతోడ నెఱిమించు వెడద ముత్తరుల తోడఁ

గీ. బొలుచు మాతోడ నెట్లెనఁబోలుసరసి, సరసిరుహషట్పద రథాంగ ఝష మృణాల
పులిన హల్లక వీచికా కలిత యగుచు, నెంతపొరలిన నని కేరి రింతులపుడు. 54

ఉ. వేడుక తోడఁ బాడుచును వీడుచుఁ గూడుచు నీటఁజల్లు కో
రాడుచు నోలయోలయని యాదట నీఁదుచు ముంచి మున్గుచున్
వేడబమొప్ప నీల ఘనవేణులు గ్రీడలొనర్చి రెంతయున్
గోడె మెఋంగు గబ్బివలి గుత్తపు గుబ్బల బంటి లోతునన్. 55

చ. మెలఁతుక యోర్తు తమ్మివిరి మీఁది మదాళులఁ జూప నయ్యళుల్
చెలియ మొగంబు పద్మమని చేరిన నెచ్చెలి చేతి తామరం
బలుమఋఁ దోలుచున్న నటఁ బాసి కుచంబులు తమ్మి మొగ్గలం
చెలమిని వ్రాలి తూలి పరువెత్తె వడిన్మెయి తావి పర్వినన్. 56

సీ. తనబోటియనుచుఁ దత్తటవిహార రథాంగ మొకకొమ్మ గుబ్బ చన్నొడిసి పొడిచెఁ
దనకులస్వాములందఱు వచ్చిరోయని భ్రమరి యొక్కతె వేణి భ్రమరి వాఱె
వింతతూండ్లివియంచుఁ జెంతఁద్రిమ్మరునంచ యొకలతాతన్వి బాహువులఁగఱిచెఁ
గ్రొత్త విందులు విరిగూడి యాడుదమంచుఁ గచ్ఛపంబొకతె మీఁగాళ్ళఁ బెనఁగె

గీ. నమిత లావణ్య తారుణ్య హారి భూరి, సుందరాకార రేఖాభి శోభితాతి
దివ్య శృంగార లీలలఁ దేజరిలెదు, నృపతి కన్యలు జలకేళి నెఱపునపుడు. 57

ఉ. బోటి యొకర్తు నీటిపయి బోరగిలం బడి యీఁదియీఁది మే
పాటవ మొంది కుందు నెడఁ బల్లవపాణి యొకర్తు వల్కె నో
పాటలగంధి నీ కుచ విభాస్వర కుంభయుగంబు గల్గఁగా
నేటికి నీటికిన్ వెఱవ నీఁతకు మిక్కిలి లోతు గల్గనే. 58

మ.ఒక నారీమణి పద్మనాళమున నీరొప్పారఁ బూరించి వే
ఱొక బింబాధర మీఁదఁనూఁద నది యోహో కాచికొమ్మంచుఁ బూ
నికతో నీట మునింగి యీఁది చని యన్నీరేజ పత్రాక్షి వా
లిక కన్నుంగవ మూసి ముంచి విడిచెన్ లీలావతుల్ నవ్వఁగన్. 59

సీ. తమయాన విస్ఫూర్తిఁదాల్చునో యివియంచుఁ గలహంసతతులఁబో గదిమిగదిమి
తమముంగురులసాటి దనరునోయివియంచుఁ దుమ్మెదగమిఁ బారఁదోలి తోలి
తమకుచంబుల పోల్కె నమరునోయివియంచుఁ దరలిఁజక్కవల బోఁదఱిమితఱిమి
తమమొగంబులఁబోల దలఁచునోయివియంచు మంచి తామరవిరుల్ ద్రుంచిత్రుంచి

గీ. నిజ పయోధర కుంభ వినిర్గళ న్మ, సార సారంగ మదఘన సారగంధ
సార కాశ్మీర హిమనీర సౌరభాతి, వితత కాసారమునఁ దేలి రతివలపుడు. 60

మ.రమణీయాలక జాలక భ్రమరముల్ రాజన్మహోరోజ చ
క్రము లత్యంత విశాలలోచన విసారంబుల్ కళావిస్ఫుర
ద్విమలాస్యాంబుజముల్ భుజా బిసము లుద్వృత్తిం బ్రకాశింప జం
గమ కాసారములోయనం బొలిచిరా గంధేభ రాడ్గామినుల్. 61

గీ. అంత జలకేళిఁ జాలించి యబ్జముఖులు, తటతలంబునఁజేరి కుంతలము లార్చు
కొని తురుంబములలరించుకొనివిభూష,ణాంబరాదికములుదాల్చి యచటఁదరలి.

గీ. మరల వనిలోఁబ్రవేశించి మనసిజాత, దేవతాసార్వభౌముఁ బ్రార్థింపఁగోరి
సరసకిసలయ లసిత రసాలసాల, మూలమునఁ గప్రపుటనంటి మోఁకక్రింద. 63

క. నిగనిగమను తొగరారా,జగిలెపయిన్ మృగమదంబు సాంకవ మగరున్
మొగిఁ గలిపి యలికినను క్రొం,జిగి కప్రపు ముగ్గులిడి విచిత్రం బెనయన్. 64

గీ. అందుఁగెందమ్మిసెజ్జపై నిందిరా కు,మారుఁ గస్తురిచే వ్రాసి మఱియుఁదరిని
రతిని లిఖియించి మందమారుత వసంత,శుక వనప్రియమధుపశారికల వ్రాసి. 65

ఆ. పత్ర పుష్ప గంధ ఫలమధురసములఁ, గోరి షోడశోపచార విధులఁ
బూజచేసి పూవుబోఁడులాతతభక్తిఁ, దగిలి యిట్టులనుచుఁ బొగడి రపుడు. 66

సీ. దండ ముద్దండ దోర్దండ విమండిత చండ పుండ్రేక్షు కోదండ నీకు
జోహారు సరస ఫలాహార మృదుతర వ్యాహారభాకీర వాహ నీకు
వందనంబిందిరా సుందరీ హృదయారవింద సంధానితానంద నీకు
నతి శతక్రతు ముఖాదిత సుతస్తుత మహోద్భుత ఘనవిక్రమ వితత నీకు

గీ. మొద్పుఁ గెంగేలు సమధికాంబుజభవాండ, భాండసంవేష్టితాఖిల ప్రాణిహృదయ
భేదనప్రక్రియాచణ స్ఫీతశాత, చూత కోరక విశిఖ సంఘాత నీకు. 67

క. మారాయ భూరితర సుకు, మారాయ రమాసతీ కుమారాయ మహో
దారాయ రతి వధూటీ, దారాయ వియోగినీ జిదారాయ నమః. 68

మ.కోకిల. గాలితేరును దుంట విల్లును గండు తుమ్మెద నారియుం
బూల కోలలు మీను టెక్కెముఁ బల్లు మావులుఁ గ్రాలఁగా
హాళిమై మగలం బడంతుల నల్లిబిల్లిగఁ గూర్చి యేల్
మేలు బంటవు నిన్ నుతింపఁగ మేము నేర్తుమె మన్మథా ! 69

గీ. అని మనోభవుఁగొనియాడి వనజవదన, లెల్లఁగుసుమాసవము గ్రోలనిచ్చవుట్టి
కనక ఘటముల సీధువునినిచి పసిఁడి, కోరలం దోలి వడ్డించుకొని చెలంగి. 70

గీ. గుటుకు గుటుకునఁ గ్రోలుచుఁ గొసరుకొనుచుఁ
జవులు చూచుచు నిది యహా సరస మధుర
వస్తువని కొనియాడుచు వాసనలకుఁ
జొక్కుచును సోలుచును ద్రావఁ జొచ్చిరపుడు. 71

క. కుమ్మరి సారె విధంబునఁ, ద్రిమ్మరఁగాఁ జొచ్చెఁ బుడమి దిర్దిర నిపు డ
మ్మమ్మ కనుంగొనరే యని, పిమ్మటఁ గొనియొర్తు కేలు బిరబిరఁ ద్రిప్పెన్. 72

ఉ. పయ్యెద బాప నాజిలుగుఁ బయ్యెద దియ్యకు చంటిమీఁదఁ జే
వెయ్యకు మేన్నగుర్పొడువ వే గిలిగింతలు వెట్టరాకు నీ
నెయ్యము చాలుఁ బొమ్మనుచు నిబ్బరపున్మదిరా మదంబునం
దొయ్యలి యొర్తు మైమఱచి తూలి వడంకఁగఁ జాగెనయ్యెడన్. 73

క. వెడవింటి తాత తాతా, వడిఁ బైకొని నన్నుఁ జెనక వచ్చెద వహహా
యొడలెఱుఁగవు యని త్రుళ్ళుచుఁ, బడఁతులతలమిన్నయొర్తు పకపకనవ్వెన్. 74

సీ. తుంబురుండీడె నాతో గానమున నంచు వీడన తందనల్ పాడె నొకతె
రంభ నాకెనయె నర్తనకళా విధినంచు వెడవెడ గంతులు వ్రేసె నొకతె
రతి నాకు సరియె యంచిత రూపముననంచు మించు పూనిక వెక్కిరించె నొకతె
వాణి నాతో సాటి వచ్చునె చదువున నంచుఁ బ్రేలుచుఁ గాఱులాడె నొకతె

గీ. బహుళతరువర సంజాత పత్రమూల, ఫల కుసుమ సార శర్కరామిళిత మధుర
వారుణీపాన కలనాప్రవర్ధమాన, మరభరోన్మాదమున నెద మఱపుఁ గదిరి. 75

సీ. మదిరాక్షి యొక్కతె యిదె ప్రియుండరుదెంచె నంచు బయల్ గౌఁగిలించుకొనియె
వెలఁది యొక్కతె భర్త విడెము చుట్టిడెనంచుఁ దివురొప్పుఁగానోరు దెఱచుకొనియెఁ
జెలువయొక్కతె పతి జిలుగుఁబయ్యెదయూడ్చెనంచు బొమ్ముఁనఁజేతులానుకొనియెఁ
బడఁతియొక్కతె నీవి సడలించె విభుఁడంచు మరునిల్లు డాకేల మాటుకొనియె

గీ. నింతి యొక్కతె ధవుఁడు గిల్గింత లిడియె
నంచు నెమ్మేనఁ బులకము లంకురింప
నులికి పడుచుండె నయ్యారె బలితమైన
మధు మదోన్మాదమున నొడల్ మఱచి యపుడు. 76

సీ. అక్కడక్కడ నిల్చి గ్రుక్కిళ్ళు మ్రింగుచు సురకుఁ దారెదరేల చుక్కలార
చేయెత్తి మ్రొక్కుచు సీధువుఁ దెమ్మని తవిలి వేఁడెదరేల తరువులార
పొదల మాటునఁబొంచి మదిర మ్రుచ్చిలి పోవ మిట్టి చూచెదరేల మెకములార
మ్రాఁకులపైఁజేరి మధువు గ్రోలఁగఁగోరి చెలఁగి కూసెదరేల పులుఁగులార

గీ. యాసవము నాస వెంబడి నంటి జంట
వీడ కుండెద రేటికి నీడు లార
యనుచుఁగొందఱు విరిబోఁడు లాము మీఱి
పలువరింపుచు నుండి రబ్బురము దోఁప. 77

గీ. అట్లు వనవీధిఁ గ్రీడించి యనుఁగు జెలులఁ
బెరసి క్రమ్మఱ నగరున కరుగుచున్న
పాండ్య నృపపుత్రిఁ గనుఁగొని పాండవేయుఁ
డెద ముదం బావహిల విశారదుని కనియె. 78

క. ఎవ్వరి చిన్నదొ యీ యెల, జవ్వని పూవింటి మేటి సామరి కేలన్
నివ్వటిలు మెఱఁగుఁజాయలఁ, గ్రొవ్వాడి కటారి యనఁగఁగొనబు వహించెన్. 79

ఉ. అద్దిర దీని ముద్దు మొగమచ్చపుఁ బున్నమ చందమామ తో
నుద్దిర కన్నుదోయి వికచోత్పల పంక్తుల నేలcజాలు మేల్
నిద్దపు టద్దపుంబలక నిగ్గుల నెగ్గులు వల్కుఁ జెక్కు లీ
ముద్దియ సోయగం బరిది మోహముఁ గొల్పె మనోజ్ఞ వీధికిన్. 80

ఉ. కన్నుల వింటిదంట శితకాండ పరంపరఁ గ్రుమ్మరించు నీ
యన్నుల మిన్న కన్నుగవ యద్దిర గద్దరి తేcటిదాcటులన్
బన్నము నొందcజేయుcగద బాల నిగారఁపు సోగ పెన్నెరుల్
క్రొన్నన బంతులం దెగడుఁ గొమ్మ మిటారపు గబ్బిగుబ్బలున్. 81

సీ. తుమ్మెదల్ నెలవిండ్లు తొగలు సంపెఁగ మొగ్గ శ్రీలద్దములు మగనాలుఁ గెంపు
దరము మృణాలముల్ తమ్ములు జక్కవల్ భుజగంబుఁ దరగలుఁ బొన్నపువ్వు
సింగంబుఁ బులినమరంగులు దింటెన పూవంటి కబ్బముల్ పొదులుఁ గమఠ
ములుఁ జిగురాcకులు ముత్తియంబులు వటఫలములు ఫలకంబు బంగరంబుఁ

గీ. గూర్చి నెత్తమ్మి పూcజూలి కొంతలేని, ప్రోడతనమూని యిమ్ముద్దు పువ్వుcబోcడి
బోడిమిదలిర్ప నొనరింపcబోలునట్లు, గాకయుండిన నీ సొరు గలదె యెందు. 82

ఉ. కన్నుల వింటి దేవర జగంబు భ్రమింపఁగ నిడ్డ మేల్పదా
ర్వన్నె కడాని బంగరు హొరంగుల జంత్రపు బొమ్మయేమొ నా
కన్నుల కబ్బురంపు జిగి గల్పన సేయుచు నుండి యిప్పుడీ
యన్నుల మిన్న సోయగము హా మది కెంతయు నాస కొల్పెడిన్. 83

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని గుత్తపు గుబ్బలు కేల నొక్కుచున్
మచ్చిక హెచ్చఁ గ్రచ్చుకొని మాటికిఁ జక్కెర మోవి యానుచున్
నిచ్చలు దీనిఁ గూడుకొని నెమ్మి వసింపక యున్న నన్నహో
పచ్చని వింటి దంట పలు బాములఁ బెట్టక నిల్వ నిచ్చునే. 84

క. అని యనివారిత మోహం, బునఁ దనరుచునున్న పాండుపుత్రునిఁ గని యి
ట్లనియె విశారదుఁడప్పుడు, వినయ వివేకాతిశయము విస్తరిలంగన్. 85

గీ. అవని నాయక మలయధ్వజావనీశ, తిలకు గారాబుపట్టి యీ కలికి మిన్న
పేరు చిత్రాంగదయటంద్రు చారురూప,కులసుశీలాది గుణములనలరుcజుమ్మీ. 86

క. అనిన విశారదుఁ గన్గొని, యనియె ధనంజయుcడు మణిపురాధిపు పురికిం
జని మారాకయుఁ దలcచిన, పని యారాజునకుఁ దెల్పి పరువడి రమ్మా. 87

సీ. అనుడు విశారదుఁడప్పుడె మణిపురంబునకేగి యమ్మహీభుజుని గాంచి
యతనిచేత సపర్య లారూఢిఁ గైకొని వాసవి యచటికి వచ్చుటయును
వనమునఁ జిత్రాంగదను గాంచుటయుదానిఁ గూరిమిఁబెండ్లాడఁగోరుటయును
జెప్పిన సంతోష చిత్తుఁడై యవ్విభుం డర్జును సన్నిధి కపుడె చని య

గీ. నేక భంగుల నతని బహూకరించి
తోడుకొని తెచ్చి యొక పైఁడి మేడ లోన
నిలిపి మజ్జన భోజనాదులఁ బ్రతృప్త
హృదయుఁగాఁ జేసి యుడుగర లిచ్చి యంత. 88

గీ. ప్రాజ్ఞులఁ బురోహితామాత్య బంధు జనుల
నెల్ల రావించి యవ్విధం బెఱుఁగఁ జెప్పి
శుభ ముహూర్తంబు నియమించి యభిమతముగ
లలిఁ బురము నంతిపురము నలంకరించి. 89

సీ. మంగళ తూర్య మృదంగ నిస్సాణ కాహళ భేరికా రావములు చెలంగఁ
గ్రందుగా గణికా నికాయంబు నర్తింపఁ గరదీపికా సముత్కరము మెఱయ
బిఱుసులు చివ్వలు మెఱఁగుఁ జంద్రజ్యోతులును నభోవీధి వెలుంగఁ జేయ
మేదినీ దివిజుల వేదనాదము లొప్పఁ దమి బేరటాండ్రు గీతములు వాడ

గీ. సకల వైభవముల తోడ జనవిభుండు, తనదు గారాబు పట్టి నుత్తమ గుణ ప్ర
చారుఁడగు సవ్యసాచికి ధారవోసి, ప్రేమ విధ్యుక్త పద్ధతిఁ బెండ్లి చేసె. 90

వ. అట్లు మహోత్సవంబుగ నుద్వాహంబొనర్చి, మలయధ్వజావనీ వల్లభుండల్లునికి గజ తురగ రమణీ మణిభూషణాంబరాదికంబు లుడుగరలొసంగి గారవించి యునిచిన మోదంబున నయ్యర్జునుండు చిత్రాంగదా మదాలివేణిం గూడుకొని గాఢ పరిరంభ చుంబనాది సంభోగ లీలా విహారంబుల నుల్లసిల్లుచు గొన్ని మాసంబు లచ్చట నివాసంబుఁ జేసి యంత నారాజుచేత ననుజ్ఞాతుండై యందులం దరలి. 91

క. దక్షిణ పుణ్యక్షేత్రము, లీక్షింపుచు నరిగి యరిగి యెదుటఁ గనె నరుం
దక్షిణ మోక్ష సంగ్రహ, దీక్షన్ సౌభద్ర నామ తీర్థోత్తమమున్. 92

క. కని తత్తోయాంతరమున, మునుఁగం బోవుటయు నచటి మునివరు లోహో
చనవలవదు సుమ్మిమ్మడు,గున నొక నక్రంబు మెలఁగు ఘోరాకృతితోన్. 93

ఆ. వారి మునుఁగఁ బోవు వారి నిందుల నని,వారితోఁ(గ శక్తి వారిచరము
వట్టి మ్రింగుచుండు వట్టి మాటలుగావు, పోవ వలదు వలదు భూపచంద్ర. 94

క. ఓ తేఁడ యిక్కొలంకున, నూతేఁడుల బట్టి బలిమి నూల్కొనుచుండున్
గాఱుమొసలి యొక్కటి మురి,మీఱఁగ జంతువులఁబట్టి మ్రింగుచు నుండున్. 95

సీ. మోక్షంబునకుఁబోవ మొసలెత్తుకొని పోవుననెడు సామెత నిక్కమగునటంచుఁ
జొఱఁబోవ వెఱతు రెవ్వరు నిందులోన నీవతి సాహసము పూని యరుఁగఁదగునె
యననలంతిగ నవ్వి యర్జునుండప్పుడే వెఱవక నీటిలో నుఱుకుటయును
దర్పంబెలర్పంగఁ దటుకున నెగసి నక్రము వట్టుకొనిన నక్కవ్వడియును

గీ. నెడమ కరమునఁబట్టి యయ్యెడ మకరము, నేపు దైవాఱఁ బైటికి నీడ్చివైచె
వైచుటయు నది నైజరూపంబుఁ బాసి, రహిని జూపరకెల్ల నబ్రంబు దోఁప. 96

ఉ. గుత్తపు గుబ్బ చన్నులును గ్రొత్త జగాజిగి కావి మోవియున్
బిత్తరి తళ్కుఁ జూపులును నిద్దపు ముద్దు మొగంబుఁ దమ్మి యు
న్మత్త మయూర పింఛ నిభ మంజుల వేణియుఁ గల్గి లీలతో
నత్తఱిఁ దొంటి సోయగపు టచ్చరయై తగ మ్రోల నిల్చినన్. 97

క. ఆ రమణీమణిఁ గాంచి ధ,రా రమణాగ్రేసరుఁడు గరం బబ్ర మెదం
జేరఁగ నతి మృదుమధుర సు,ధారస ధారలు స్రవింపఁ దానిట్లనియెన్. 98

గీ. ఉవిద మును నీవు మొసలివై యుండి యిపుడు
లలిత సౌందర్యవతివై విలాస లీల
నుండుటకుఁ గారణంబేమి యున్న తెఱఁగుఁ
దేట తెల్లంబుగా మాకుఁ దెలుప వలయు. 99

క. అనవుండది యిట్లను విను, మనఘా యేఁ నంద యనెడు నచ్చర చానన్
ధనదునకు నంగనాసఖు, లనుపమ గుణయుతలు నలువురలరుదు రెమ్మిన్. 100

గీ. వారు లలిత సమీచియు వంగ సౌర,భేయి యనెడు నభిఖ్యల వెలయువారు
సొరిది మేమేవురము భూమిఁజూడవచ్చి,కడలికడనొక్క యబ్రంపు కానఁగాంచి. 101

ఉ. కొప్పులు వీడఁబాఱ నిఱి గుబ్బల పైఁటలు జాఱ సారెకుం
జిప్పిలి మోము దామరలఁ జెమ్మట బిందువు లూఱఁ గోరికం
బుప్పొడి తిప్పలెక్కుచును బూవులు గోయుచుఁ దేనె లానుచున్
ముప్పిఱి గొన్న వేడుకల ముచ్చట లాడుచుఁ గ్రీడ సల్పఁగన్. 102

మ.సరసన్ వీవఁదొడంగె నప్పుడు వనీ సంజాత నానాలతా
తరు సంఘాత వినూతనస్ఫుట లతాంత ప్రాకటామోద మే
దుర నిర్యన్మకరంద బిందు మిళదస్తోకాభిరామ క్రియా
పరిఖేల న్మలయాచలాగత జగత్ప్రాణాంకుర శ్రేణికల్. 103

క. అమ్మరుదంకురములు మేఁ, జెమ్మటలు హరింప సంతసిల్లుచు మే మొ
క్కుమ్మడిఁ గోర్కుల ---, గమ్మ విరుల్ కోయుచుండఁగం జని యొకచోన్. 104

క. మునియొకఁడు తపముసల్పఁగఁ, గనియది చెఱుపంగఁదలఁచి కుచకచ జఘనా
భినవ విలాసము వెలయఁగ, ననుపమగతి మెలఁగ నాతఁడతి కోపమునన్. 105

క. మకరాకృతి మీ జంఘలు, ప్రకటంబై యుండుఁగద విభాస్వర లీలన్
సకలాంగంబులు మీకిఁక, మకరాకృతి నుండుఁజుండి మదవతులారా. 106

గీ. అనుచు శాపం బొసంగ మేమాత్మ బెగడి
విన్నఁ బోవుచుఁ గడు మ్రొక్కి వేడుకొనిన
నంతట దయారసాప్లుత స్వాంతుఁ డగుచు
నమ్మునీంద్ర వతంస మిట్లనుచుఁ బలికె. 107

ఉ. ఓ పురుహూత నీల నికరోపమ కైశికలార తప్పదీ
శాపము దైవికంబిది విచార మిఁకేటికి మీరలిప్పు డీ
రూపులఁబాసి దక్షిణ సరోవర పంచక మధ్యమంబులం
దోపికతో శతాబ్దము లనూన జలగ్రహ వృత్తి నుండుడీ. 108

క. అంతటఁ దీర్థాచరణ, స్వాంతుం డర్జునుఁడు వచ్చి సత్వరమున శా
పాంతము గావించును మీ, కెంతయు నిజరూపురేఖ లెనయుంజుండీ. 109

ఆ. అని వచింప నియ్యకొని నీదురాక గాం,క్షించు కొనుచు నిందుఁ జేరి మొసలి
రూపులూని క్రుమ్మరుచు నుంటిమిప్పుడు, మామకీన భాగ్య మహిమ వలన. 110

క. నినుఁ గనుఁగొంటిని నేఁజే, సిన పుణ్యము చక్కనయ్యె శీఘ్రుంబున ద
క్కిన తీర్థంబులఁ గల నా, యనుఁగుల రక్షించి కావుమని వేఁడుటయున్. 111

క. చని తీర్థ చతుష్టయమున, మునుఁగుచుఁ దనుఁబట్టుకొనెడు మొసళుల నాల్గిం
టినిబట్టి బైటవేసిన, ననిమిష గాంతా లలామలై వా రెలమిన్. 112

ఆ. ఓ మహానుభావ నీ మూర్తిఁ గాంచుట, వలన మాకుఁ గస్తి దొలఁగి తొంటి
రూపులూనఁ గలిగె నీ పౌరుషంబు వ,ర్ణింపఁ దరమె యన్నిలింపులకును. 113

మ. చిర సామ్రాజ్య రమా ధురంధరుఁడవై సింహాసనాధ్యాసి వై
పరమానంద మనస్సరోరుహుఁడవై ప్రఖ్యాత సత్కీర్తి వై
యరి హృద్భీకర బాహువిక్రముఁడవై యాకల్ప సంస్థాయి వై
ధర వర్ధిల్లుము పాండవాన్వయ మణీ ధాత్రీధవ గ్రామణీ. 114

గీ. అనుచు దీవించి యచ్చర లమరపురికి
హేమరత్న విమానంబు నెక్కి చనిరి
కవ్వడియు నందు వెడలి గోకర్ణ శంభు
మూర్తి దర్శించి సద్భక్తి మ్రొక్కు లొసఁగి. 115

ఆ. భాసమాన గతిఁ బ్రభాస తీర్థంబున, కరిగి యందు విహిత గతి నిధాన
ధర్మములును స్నాన తర్పణాదికము గా,వించుకొనుచు సాధు వృత్తినుండె. 116

క. అని శౌనకాది మునులకు, ననఘస్వాంతుఁడగు రౌమహర్షణి వినిపిం
చినవిని యవ్వలి కథయును,వినుపింపుమటంచుఁదవిలి వేఁడుకొనుటయున్. 117

మ. కవి విద్వజ్జన గేయ సాధుహిత భక్త త్రాణ ధౌరేయ వా
సవ నీలోపమ కాయ సంతత జగత్సంరక్షణోపాయ భూ
దివిజానీక విధేయ శీతల ధరిత్రీ భృత్సుతా ధ్యేయ దా
నవ దర్వీకర వైనతేయ తృషితామ్నాయా జగన్నాయకా. 118

క. మీన కమఠ కిటి నరపం,చానన వటు రామ రఘుప హరి జన యవన
ప్రాణాపహారకాదిక, నానా దివ్యావతార నత మందారా. 119

మాలినీ. అగణిత గుణ సారా హాటకాహార్యధీరా
జగదవన విచారా సంభృతాజాండ భారా
నిగమ నుత విహారా నిర్జితారాతి వీరా
దిగధిప పరివారా దీనతా ధ్వాంత సూరా. 120

*ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపానిరీక్షణ సంలబ్ధ సారకవితావిచిత్ర*

*కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర*

*సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ నామధేయ*

*ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను*

*శృంగారరస ప్రబంధంబునందుఁ*

*తృతీయాశ్వాసము*

# చతుర్థాశ్వాసము

**శ్రీ లలనాభ సుభద్రా**
**నాళీక కుచాగ్ర గంధ నవమృగనాభీ**
**మేళన చణ కర కిసలయ**
**పాలిత భూవలయ నీల పర్వత నిలయా.** 1

వ. అవధరింపుము నైమిశారణ్య మహర్షులకు రౌమహర్షణి యిట్లని చెప్పం దొడంగె.
అట్లర్జునుండు ప్రభాస తీర్థోత్తమ స్థానంబున నిలిచియుండి యొకనాఁడు. 2

క. ద్వారక యిచ్చటి కెంతయుఁ, జేరువయని యెల్లవారుఁ జెప్పఁగ విందున్
వారక సుభద్ర రుచిరా,కార విలాసములు చూడఁగా వలె నింకన్. 3

ఉ. కన్నులు గండుమీలు బిగికౌను మృగేంద్రము నేలు సిబ్బెపుం
జన్నులు బొంగరాలు పలుచాలుపు నున్మగరాలు జాళువా
వన్నెఁ గఱంపఁ జాలు చెలువమ్మగు నెమ్మెయి డాలు మేలహో
కన్నెల మిన్న నెన్నఁడిఁకఁ గన్గొను భాగ్యము గల్గనున్నదో. 4

ఉ. నీలపు రాల వెగ్గలపు నిగ్గుల నెగ్గులు వల్కు ముంగురుల్
మేలి కడాని బంగరపు మించు లతాంగి మై సిరుల్
వాలిక గండుమీల చెలువమ్ము లవమ్ముగఁ జేయుకన్ను ల
బ్బాలికఁ గౌఁగిటం బెనుచు బాలిఁక నా కెపు డబ్బునో సుమీ. 5

ఉ. వాడని దొండపంటి కెనవచ్చు నిగారపుఁ గావి మోవియున్
నాడెపు నిల్వుటద్దముల నవ్వెడు చెక్కులుఁ జందమామ నె
గ్గాడఁ గడంగు మోముఁ గల యంగన ముంగల నిల్చి కన్నులం
జూడక చూచినట్లగుచుఁ జొక్కెడు డెంద మిఁకేమి సేయుదున్. 6

క. ఏరీతి ద్వారకాపురిఁ, జేరుదు నెబ్బంగి దాని చెలువంతయుఁ గ
న్నారఁగఁజూతు నిఁకేగతిఁ, గోరిక దీఱంగ దానిఁ గూడి సుఖింతున్. 7

గీ. అనుచు నచ్చాన వరియించు నాస మించి
తీర్థ సంసేవ చాలించి ధృతిఁ జలించి
యతి విధేయులు యదుకులు లనుచు నెంచి
యనుచర బలంబు నందంపఁ జనఁగఁ బంచి. 8

క. నారాయణ నామం బు,చ్చారణ మొనరించు కొనుచు సంయమి వేషం
బారూఢగతి ధరించెం, దా రాజసవృత్తి మాని దాఁసాసక్తిన్. 9

క. రేయింబగలుఁ దదీయా, మేయాకృతి మదిఁదలంచి మేనెఱుఁగక భూ
నాయక మణి తత్సంగమ, సాయుజ్యముఁగోరి తపము సలుపుచు నుండెన్. 10

క. ఆరీతి నుండి తనమదిఁ, గోరిక సమకూర్ప హరికిఁ గుతుకము గలదా
సీరికిఁ గూడదు మఱియే, తీరునఁ దమి దీరు ననుచు దృఢతర భక్తిన్. 11

క. ఆపన్న రక్షణైక కృ,పా పూర్ణ కటాక్ష వీక్షణాన్వితుఁడగు నా
గోపాలకృష్ణ దేవుని, శ్రీపాదము లాత్మలోనఁ జింతించుటయున్. 12

చ. కరముల శంఖ చక్రము లఖండ గతిన్ వెలుఁగొంద నౌఁదలన్
సరసిజ రాగ రత్న విలస న్మకుటం బలరం గటీ తటిన్
సురుచిర హాటకాంబరము శోభిల సుందర మందహాస భా
స్వరముఖుఁడై మురాంతకుఁడు వచ్చె రయంబ కిరీటి చెంతకున్. 13

గీ. అట్లు వచ్చిన కంసాసురారిఁ జూచి
హర్ష పులకిత గాత్రుఁడై యవనిఁ జాగి
మ్రొక్కి కరములు ముకుళించి పెక్కు గతుల
నుతులు గావింప నయ్యింద్ర సుతునిఁ గాంచి. 14

క. సేమ మరసి నీ మదిఁగల, కామిత ఫలమిఁక లభించుఁ గడు వేగమునన్
లోమరుగక చని యుండుము, రాముఁడెఱుఁగ కుండ నీవు రైవతకాద్రిన్. 15

ఆ. అనుచు నానతిచ్చి హరి తనపురికేగ, సంతసంబు లోన నంతకంత
కగ్గలంబు గాఁగ నర్జునుండటఁ బాసి, వాసి మీఱఁ ద్రోవ వట్టి చనుచు. 16

చ. అకుటిల లీలఁ గన్గొనియె నాతఁడు సంభ్రమ సంభృతాత్ముఁడై
వకుల రసాలసాల నిరవద్య లతాంత మహా పరాగమున్
సుకర మరంద పానరత సుందర బంభర డింభ రాగమున్
బ్రకటిత పద్మరాగమును రైవతకాహ్వయ భాసురాగమున్. 17

సీ. గంధ సింధుర ఘటాగండ గండోలాగ్ర నిస్సరద్దానంబు నిర్ఝరంబు
నిర్ఝర నికురంబ నిస్వనస్తనిత విభ్రాంతి ముహుర్నటద్బర్హిణంబు
బర్హిణ సంఘాత బహుళ కేకారవ ప్రచలిత నిరవద్య పన్నగంబు
పన్నగ పరివృఢ పటు ఫణోదంచిత దివ్యమణి ప్రభా దీపితంబు

గీ. చటుల మృగయా విహార లంపటకిరాత, భామినీ హారి వక్షోజ భాగలిప్త
కమ్రకస్తూరికా గంధ గంధిలం బ,హార్య రాజంబు రైవతకాచలంబు. 18

క. అందుఁ బ్రవేశంబై సం, క్రందన నందనుఁడు చూత కాంచన కదలీ
చందన మందారావృత, కందర భాగమున మఠము గట్టుక యుండెన్. 19

సీ. కనక సౌధాగ్రభాగములఁ ద్రిమ్మరు ప్రోడ గిరిగహ్వరంబులఁ దిరుగనోపెఁ
జీనిచీనాంబర శ్రేణిఁగట్టు ఘనుండు కాషాయ వస్త్రముల్ గట్టనోపె
సారంగ మదగంధ చర్చ దాల్చెడు భోగి భూతి నెమ్మెయినిండఁ బూయనోపె
నవరత్న సింహాసనమున నుండెడు మేటి గండోపలములఁ గూర్చుండ నోపె

గీ. గజ రథ తురంగ భట భృత్య గణము గొలువ
నుండు నొడయం డొకండుఁ బన్నుండ నోపెఁ
బట్టభద్రుండగు విభుండు పడఁతిఁ గోరి
పలుఁ దెఱంగుల నిడుమలఁ బడఁగ నోపె. 20

సీ. బాలికామణి పేరు బలుమాఱు నుడువుట సారనారాయణ స్మరణగాఁగఁ
బడఁతి యాకారమెప్పుడు లోఁదలంచుట నిబిడ హరిధ్యాన నియతిగాఁగ
లలన సంభోగ లీలావాంఛఁ జొక్కుటఁ బ్రవిమలానందానుభవము గాఁగఁ
గామినీ రత్నంబుఁ గదియనూహించుట ముక్తి కాంతా సమాసక్తి గాఁగ

గీ. మది నశేష ప్రపంచంబు మఱచియాతఁ,డా సుభద్రాసతినిఁజెందు నాసఁదవిలి
దంభ సన్యాసి వేషంబుదాల్చి యబ్బు,రంపు వలవంతసెగలఁ గృశింపుచుండె. 21

సీ. కర్పూర గంధుల కచవిలాసములకుఁ జిగురుబోఁడుల ముద్దు మొగములకును
జలజాతముఖుల వాల్తళుకుఁ జూపులకును రమణుల బింబాధరంబులకును
గొమ్మల సిబ్బెంపు గుబ్బగుబ్బలులకు లలనల జిలిబిలి పలుకులకును
జెలువల నిద్దంపుఁ జెక్కుటద్దములకు వెలఁదుల శృంగార వేషములకు

గీ. ఫలజలదళానిలాహారములకు నవయు, బలునిరాబారి పెద్దలు బలసి వెంటఁ
దిరుగుచుండుదురహహ యిద్ధరణినొక్కనరుఁడుతరుణినిగోరి వేసరుటయరుదె. 22

క. ఆవిధమునఁ గ్రీడి సుభ,ద్రా వనితామణిని గోరి తప సుతులగతిం
గావింపుచు నున్నయెడన్, బ్రావృట్కాలము వసుంధరా స్థలిఁదోఁచెన్. 23

ఆ. రాహువునకుఁ దమకు రహినిదమోభిధా,నంబు గలుగఁ బ్రతిదినంబు వెఱవ
నేల వీనికని దినేశ్వరుఁ బొదవు త,మంబులన ఘనాఘనంబు లలరె. 24

ఆ. నాతిఁగోరి యింద్ర నందనుండు తపించు,చున్నవాఁడు చోద్యమొదవు నంచుఁ
జూడవచ్చు ఖచర సుందరాంగులొడళ్ళ, మెఱపులనఁగఁమింట మెఱపులెసఁగె. 25

గీ. వనజముఖిఁ గోరి కృశియింప వలువఁ దింకఁ
దావకీన మనోభీప్సితము ఫలించు
నంచుఁ గొమరున కెఱుఁగ జాటించె నింద్రుఁ
డన నభోవీధి నుఱుము లేపునఁ జెలంగె. 26

గీ. తనసుతుం డర్జునుండొక్క తరుణిఁగోరి, తప మొనర్చుచునుండెఁ దత్తాపమార్ప
వలయునని వజ్రి చల్లించు సలిలధార, లనఁగ ఘనవర్షధారలు మొనసికురిసె. 27

చ. అతనుఁడు పాంథసంఘముల నందఱ నొక్కట గెల్వఁబూని
తతగతి మిన్ను ముట్టి బెడిదంబుగఁ జిమ్మెడు మల్లికా శర
ప్రతతులనం ధరాస్థలిని రాలెఁగడున్ వడగండ్లు తత్కరాం
చిత సుమ కార్ముకంబనఁగఁ జెన్ను వహించె సురేంద్ర చాపమున్. 28

క. జాతులు కడుములు మొల్లలు, కేతకు లింద్ర ద్రుమములు గిరిమల్లికలున్
నూతనలీలలఁ బూచి వ,నీ తలమున కెల్ల నొరపు నెఱపుచునుండెన్. 29

ఆ. అవని రత్నగర్భ యనుపేరు దనకు ము,న్గలుగు టెల్లరకును గానఁజేయఁ
దమ్మి కెంపు గములుదాల్చెఁబై నన నింద్ర, గోప పంక్తులను- గొరలెనపుడు. 30

వ. అట్టి వర్షావసరంబున నర్జునుండు రైవతకాచల స్థానంబున వసియించి యుండె
నంత నక్కడ. 31

క. శ్రితపరిపాలన శీలుఁడు, నతులిత కరుణాలవాలుఁడగు హరి నైజా
యతనమున కరిగి మాయా, యతినర్జును నటకుఁదేఁ బ్రయత్నము చేసెన్, 32

చ. ప్రెగడలఁ బెద్దలంబిలిచి పెల్లుగ రైవతకాచలోత్సవం
బొగి నొనరింపఁగా వలయు నూళ్ళను బ్రోళ్ళు నగళ్ళు గుళ్ళు బా
గుగఁ గయిసేయఁ బంపుడని గోపవధూప్రియుఁ డానతీయఁ ద
జ్జగతి జనుల్ రయంబ సరసక్రియ నట్లొనరించి యంతటన్. 33

గీ. కప్పురము మంచి గంధము కస్తురియును
గందవొడియును చాందు సాంకవము మొదలు
పరిమళ ద్రవ్యములు మరి బహు సువస్తు
జాలములు గూర్చి పురుషులు జలజముఖులు. 34

క. నానా మణిభూషణములు, చీనాంబరములు ధరించి చెలువలరంగా
నా నగముఁజూడ వెన్నుని, యానగమున్ గూడి చనిరి హర్షం బెసఁగన్. 35

సీ. సాంబ సాత్యకి హలి శంబరాహిత గద ప్రముఖులు తమతమ పసిఁడి తేరు
లెక్కి వధూటీ సమేతులై శృంగార వేషముల్ రాణింప వెడలి చనిరి
కరు లశ్వములు శతాంగములు భటుల్ నటుల్ గణికానికాయముల్ గదిసికొలువ
భోజకన్యకయు సాత్రాజితి మొదలగు పట్టంపు దేవులు పదియు నాఱు

గీ. వేల దివ్యాంగనా మణులు వ్రోలఁ బసిఁడి
యందలము లెక్కి యరుగ సమగ్ర వైభ
వాభిశోభితుఁ డగుచు మురాంతకుండు
చనియె రైవతకాచ లోత్సవ మొనర్ప. 36

ఉ. చిత్తరు వ్రాత జీనిపని చీరఁగటిన్ ఘటియించి క్రొత్త ను
న్గత్తపు తాపితా రవికె గుబ్బల నుబ్బలరారఁ దాల్చి మే
ల్పుత్తడి మానికంపు తొడవుల్ మెయిఁబూని సుభద్ర యేగె లో
హత్తిన వేడ్కఁ గుందనపు టందల మెక్కి చెలుల్ భజింపఁగన్. 37

ఆ. అట్టు లరిగి యమ్మహా నగేంద్రము చేరి, శౌరి సతులు దాను సంతసమున
నచట నర్ష పూజ లారూఢి నొనరించి, యుచిత లీలఁ జెలఁగుచున్న యెడల. 38

క. భద్రేభరాజ యాన సు,భద్రయుఁ దన మానసమునఁ బార్థునిఁ బతిగా
భద్రగతిఁ గోరుకొని య,య్యద్రీంద్రంబునకుఁ బూజ లర్మిలిఁ జేసెన్. 39

గీ. చేసి యుల్లాసలీల నెచ్చెలులఁ గూడి, యమ్మహాహార్య మణి కందరాగ్ర సీమ
హాళిఁగ్రీడించు నజ్జవరాలిఁజూచి,యతులితామోద హృదయుఁడై యర్జునుండు. 40

ఆ. ఔర సౌర సారసాక్షుల చెలువంబు, గరుడ భుజగ యక్ష ఖచర రాజ
ముఖుల సోయగంబు మునుకొని పొగడ ని,బ్బాల కాలిగోరు బోలఁ గలదె. 41

గీ. మున్ను వీనులవిందుగా విన్నదియును, గన్నులారంగ నిపుడు గన్గొన్నదియును
నెన్ననొకచందమై మదికెలమిఁగూర్చెఁ, గలిగెఁబో దీనిఁజూచు భాగ్యంబునేఁడు. 42

సీ. వెలవెలఁబోవుచు విచ్చి పాఱకయున్నఁ గందూని పలుమఱుఁ గుందకున్న
బొరిపొరి బిగిదప్పి పొరలుడుల్పకయున్నఁ బంకార్తి మడుగులఁ బడకయున్న
రాపులఁబడి వన్నె రామిఁ జెందకయున్న జత వీడి కదలకు జరగకున్న
నీరస పద్ధతి నెఱిఁజట్టు పడకున్నఁ గాఱెక్కి దళములు గాకయున్న

గీ. ఘనసుధాకర కదళికా వనజకటక, చక్ర పంకజరాగ కిసలములీ ల
తాంగి కచవదనోరు నేత్రాంగకుచర,దాంశుకాంఘ్రులల తోడ నీడగునోయేమొ. 43

ఆ. అర్ధచంద్రుఁబోలు నలికంబు నలి నలి,కంబులను జయించుఁ గచగళమ్ము
లబ్జరాగసదృశ మధురము ధరముతో,నెన జఘనము ఘనము వనితతురుము. 44

క. నీలంబుల రోలంబ వి,నీలాంబుద ఖంజరీట నిబిడ తమ శ్శై
వాలంబులఁ జమరీ మృగ, వాలంబుల నేలఁజాలు వనిత కచంబుల్. 45

సీ. కందు చేకురని రాకాచంద్ర బింబంబు త్రాసంబు గనని ప్రాదమ్మి కెంపు
రాపులఁబడని తోరపు మించుటద్దంబు రామిఁజెందని బంగరపు సలాక
కరడు గట్టనట్టి కట్టాణి ముత్తెంబు మెఱసి వెన్కకుఁ బోని మించు దీవ
కంటకావృతిలేని కన్నె గేదఁగి పువ్వు కసటు విడ్డ జవాదికా కరండ

గీ. మౌర యీగంధగజరాజయాన చెలువు, మెండుకొని తద్దఁగన్నుల పండువయ్యె
దీనిఁగవఁగూడి సౌఖ్యాబ్ధిదేలియాడు, కడిఁదిభాగ్యంబు నాకింకఁగలుగునేమొ. 46

గీ. అనితలఁచుచున్నయెడఁబ్రలంబాది దేవ,తామహోత్సవ మొనరించి తఱలిచనుచు
మ్రోలఁగనుపట్టు శాంబరీ మునివరేణ్యుఁ,గాంచి నిక్కంపు మౌనియగా దలంచి. 47

క. వందనము జేసి స్వామీ, యెందుం డిగ్గిరికి వీఁర లేతెంచితి రీ
చందంబంతయు వీనుల, విందుగ మా కెఱుఁగఁ జెప్పవేయన నతఁడున్. 48

క. సేతు హిమాచల మధ్యో,ర్వీ తలమునఁ గల్గు పుణ్య విపిన నదీ సం
ఘాతములు దేవతాస్థలు, లాతతగతిఁ జూచు కొనుచు నానందమునన్. 49

ఆ. వచ్చివచ్చి పుణ్యవర్ధనంబై యొప్పు, నిమ్మహీధరేంద్ర మెక్కి యిచటి
వింతలెల్లఁ గలయ వీక్షించి యతినిష్ఠ, సలుపుచుందుఁ దపము సాధుగతిని. 50

క. అనుడు నపుడా హలాయుధుఁ, డనురాగము మదినివెలయ హరిఁగన్గొని యి
ట్లను నీ యతివరుఁ దోడ్కొని, మనపురికిం జనఁగ వలె సమంచిత భక్తిన్. 51

క. వీరు మహాత్ములు విమలా, చారులు నిశ్చలగుణ ప్రచారులు వీరిం
గోరి భజించిన వారికి, సారమహా పుణ్య ఫలము సమకురుఁజుమ్మీ. 52

క. మన నగరున కీ యతిఁదో,డ్కొని చని యుద్యానవాటిఁ గొదుగక యిడి నే
ర్పునఁ బరిచర్య యొనర్పఁగఁ, బనుప మజస్రంబు మన సుభద్ర నటన్నన్. 53

క. భాస్కర నిభుఁడగు కుహనా, మస్కరికి నమస్కరించి మహిత కృపా చే
తస్కుఁడగు నా నవోద్ధృత, తస్కరుఁడు నితాంత సమ్మదంబునఁ బలికెన్. 54

క. ఓ తాపసేంద్ర కుల జై,వాతృక మామనవి విని యవశ్యంబుగ నీ
చాతుర్మాస్యము మా పురిఁ, జేతోమోదంబుతో వసింపఁగ వలయున్. 55

క. అనుచు గదాగ్రజుఁడాడిన, విని కపట తపోధనుండు వినయంబున న
ప్పనికియ్యకొనిన నాతనిఁ, గనక రథారూఢుఁజేసి గౌరవ మెసఁగన్. 56

గీ. ఆప్త బలయుతులైయంత హలియు హరియు, సరభసంబున ద్వారకాపురముఁజేరి
సుందరాత్మీయ కేలికా మందిరాంగ, ణాగ్ర పుష్పిత లీలా వనాంతరమున. 57

మ.వలిఁ గప్రంపు టనంటి బోదియల గ్రేవన్ మేటి పన్నీటి వాఁ
కల పొంతన్ సురపొన్న గున్నల దరిన్ గాటంపు వాటంపు వె
న్నెల రాఱాల యఱుంగు రంగుల నెఱిన్ విప్పారు నప్పారు టా
కుల మేల్బంగరు మేడలో యతి శశాంకున్నిల్పి మోదంబునన్. 58

గీ. రాముఁడప్పుడు తద్దయుఁబ్రేమతో సు,భద్ర రావించి యయ్యతి ప్రవరునకు స
పర్యలొనరింపుచుండుము ప్రతిదినంబు, భద్రమగునీకు సంశయింపంగవలదు. 59

క. ధన్యులు త్రిజగన్మాన్యులు, సన్యాసులు వీరిసేవ సలుపఁగ భువిలోఁ
గన్యల కుచితము గావున, నన్య విచారంబు మాని యరయుము చెలియా. 60

క. అని నిజసోదరి నిటువలెఁ, బనిగొలిపి బలుండు ప్రబల బలయుతుఁడై చ
య్యన నంతర్ద్వీపమునకుఁ, జనియె శివోత్సవ మొనర్ప సంరంభమునన్. 61

గీ. అపుడు కృష్ణుఁడు భోజాత్మజాది సతుల, మంతనంబునఁగని పల్కె మన కడాని
బంగరపు బొమ్మయైన సుభద్రఁగోరి, యర్జునుండిట్లు సన్యాసి యైనవాఁడు. 62

గీ. ఇతఁడు కవ్వడియని మదినెఱిఁగి సేవ,చేయఁబోక సుభద్ర లజ్జించి యున్న
నోదనాదికమిడి యరయుదురు గాని, కొదికి మీరెల్ల నూరకుండెదరు సుండి. 63

క. అనిచెప్పి హలి పిఱుందనె, చనె హరియున్ రుక్మిణియును సత్యయు వరునిం
గని యన్న సోదరులపై, నెనరున్నదె నీకు మదిని నిండారంగన్. 64

గీ. భద్రగజయానయైన సుభద్రఁగోరి, భద్రవేషంబు మాని యిప్పుగిదిఁ గాసి
కోర్చి యతి వైతివాయన్న నోర్మిమీఱ, ననుచు లోలోన గుసగుసలాడి చనిరి. 65

గీ. అంత సుభద్రఁ గృత్రిమ యతివరునకు
సేవ గావించు కొఱకు నెచ్చెలులు కొంద
ఱెలమి వెంబడి చనుదేర నిరవుఁ దెఱలి
సదమలామోద మేదుర స్వాంత యగుచు. 66

సీ. జిలుఁగుచందురు కావి జీబుపావడ రుచుల్ సరిగంచు వలువపైఁ జౌకళింపఁ
గడితంపు మగరాల కమ్మల జగడాలు చెక్కు టద్దఁబులఁ జిందులాడ
మురిమించు హురుమంజి ముత్యాల చేర్చుక్క ఫాలాగ్రసీమ నుయ్యాలలూఁగఁ
గులుకుసిబ్బెపు గబ్బిగుబ్బలు పైఠాణి బెడఁగు కంచెలపైని బిక్కటిల్లఁ

గీ. గనక కంకణ ఝుణఝుణత్కారములును
నలఁతి మొలనూలి గంటలు నందియలును
గ్రందు సేయంగఁ గలపంపుఁ గమ్మతావు
లెయ్యడలఁ బర్వ వచ్చె మునీంద్రు కడకు. 67

గీ. అట్లువచ్చిన నవమోహనాంగి దవ్వు, దవ్వులనె చూచి తలవంచి దంభమౌని
పలుకరించక జపము నెపంబువెట్టి, కన్మోగిచియున్నఁ గాంచి యక్కలికిమిన్న. 68

గీ. వినయమునఁజేరి నతులగావించి కొంత,సేపు ముంగలనిలిచి యోతాపసేంద్ర
దేవతార్చన కిప్పుడు తెత్తునా ల,తాంత ఫల పత్ర గంధ జలాదికములు. 69

క. అనవుడు నాతండటువలె, నొనరింపు మటంచు దంభ మొదవఁగఁ జే సూ
పిన నా సీమంతవతీ, జనరత్నం బాత్మలోన సంతస మెసఁగన్. 70

సీ. తనమోవి రుచి యిట్టిదని తెల్పువైఖరి మాధురీ మహిత సమ్యక్ఫలములు
దన మేని మృదువిట్టిదని చూపుపోలికఁ గోమలామల దివ్యకుసుమములును
దనగుబ్బ లిటువంటివని చాటువడుపున సుకర నవీనాబ్జ ముకులములును
దన పల్కులిటువంటివని యెఱుంగఁగఁజేయు కైవడిఁ గర్పూర ఖండములును

గీ. దెచ్చి యందిచ్చె రత్న దేదీప్య మాన
కనక కంకణ ఝుణఝుణత్కార రవము
లింపుఁ దళుకొత్తఁ గపట యోగీంద్రు కడకుఁ
జకిత సారంగ శాబక చారు నయన. 71

క. అటువలె నందిచ్చిన న,క్కుటిలాలక ముఖ కపోల కుచ కచ జఘన
స్ఫుట విభ్రమములుఁ జూచుచు, నటునిటుఁదడబడఁగ దేవతార్చనఁ జేసెన్. 72

సీ. చెలిమోము దమ్మితావులు సుగంధముగాఁగ బోటి నవ్వులు మల్లెపూలు గాఁగ
మదవతి నున్గావి పెదవి చక్కెరగాఁగఁ గలకంఠి గళము శంఖంబుగాఁగఁ
గలికి చన్గవ హేమకలశ ద్వయముగాఁగ సతి తళ్కుచూపు లారతులుగాఁగ
భామ కీల్జడ ధూపధూమాంకురము గాఁగ రమణిపాణులు పల్లవములుగాఁగఁ

గీ. దలఁచి హృత్పద్మ కర్ణికాంతరము నందుఁ
బుష్ప సాయక దేవతా పూజ సేసె
బాలికా కేళికా మహా ఫలము గోరి
యతి ముదంబున శాంబరీ యతి వరుండు. 73

క. అతులిత భయభక్తి సమ,న్వితమతి నయ్యతి వరునకు నేర్పొదవ మధు
వ్రతవేణీ రసిరన్నము, నతి మోదం బొదవఁదెచ్చి యట వడ్డించెన్. 74

చ. అలికులవేణి యిట్లొసఁగు నట్టి ఘృతప్లుత భక్ష్య భోజ్యముల్
కలయఁగఁ జూచుచుండుటయె కాని యొకింత భుజింప నొల్లఁడా
కులుకు మిటారి వేఁదబపు గుత్తపు కంచెలలో వెలుంగు న
గ్గలపు బెడంగు గుబ్బగవఁ గాంచు పరాకున నాతఁడెంతయున్. 75

క. చేరికతోఁ బ్రణమిల్లినఁ, గోరిక దీఱంగ భిక్ష గొనుఁడని యనినన్
నారాయణ యని పలుకున్, గారుడపుం దబిసి మిన్న గౌరవమెసఁగన్. 76

ఆ. అట్లు భక్తితోడ బ్రాంజలియై మ్రోల, నున్న కన్నెఁ జూచి యన్నరుండు
చిత్తజాత చూత శితశిలీముఖ పాత, ధూత మానసాంబు జాతుఁడగుచు. 77

క. నందాదిక బృందారక, సుందరులన్ ముందు దరిసి చూడమె వారి
య్యిందుముఖిఁ బోల నేర్తురె, సౌందర్య కళా విలాస చాతుర్యములన్. 78

చ. పలుకులు తేనెజాలు, మెయి పైఁడి సలాకును బోలు, వాలుఁ జూ
పులు వలిగండు మీలు, కనుబొమ్మలు మారుని విండ్ల నేలు, గు
బ్బలు బలు బొంగరాలు, కచపాళి ఘనాఘనలీలఁ గ్రాలు, నీ
చిలుకల కొల్కి మేలు వగ చిత్తము తత్తరమొందఁ జేసెడిన్. 79

చ. బలు గుజరాతి కెంపు జిగి బాదుకొనెన్ నును గావిమోవి, క్రొం
దళుకులు నించునించు విలుదంట చొకాటపు మించుటద్దపుం
బలుకులు చెక్కుటద్దములు బంగరు రంగుఁ గరంగఁ జేయు మే
న్గలిగిన దీనిఁ గూడక సుఖంబెదఁ జేరునె తాపమారునే. 80

చ. అని మదిలోఁ దలంచుఁ జెలి యానన పద్మ మెగంది౹గం గనుం
గొని తలవంచు నించు మతి గుప్పున పైఁబరcగించు నించు వి
ల్తుని విరితూపు సోకులకుఁ దూలుచుఁ జాలఁ జలించుఁ దద్వినూ
తన తనుహావభావ లలితంబులు సారెకు నెంచు మించcగన్. 81

సీ. గ్రావోపమస్తని గంధసారము దెమ్ము ఘనవేణి మధురోదకమ్ము దెమ్ము
చేక్కెరబొమ్మ యచ్చపు పానకము దెమ్ము లతకూ౹ప కుసుమ వల్లరులుఁ దెమ్ము
చంద్రాస్య నీహార సలిల పూరముదెమ్ము కొమ్మ సారఫలోత్తరమ్ము దెమ్ము
రంభోరు కాండ కప్రంపు బల్కులు దెమ్ము సారంగనయన కస్తూరిc దెమ్ము

గీ. వేళ దప్పక యుండవే వేగ నతను, దేవతాపూజన క్రియ దీర్ప వలయు
ననుచు మరిమరిcదెచ్చినయవియెతేరc,బనుచుఁ జెలివిభ్రమములు కన్గొనcగగోరి.

క. కొమ్మా వలి జెక్కులు గపు,రమ్మా రమ్మాధరా పరాగంబని డెం
దమ్మున నించుక భ్రమసితిc, జుమ్మాయని కేలనంటిc జొక్కుచు నుండన్. 83

చ. మినుకు కడాని బంగరపు మేల్ రవణంబులుఁ జల్వ వల్వయున్
నును గపురంపు వీడ్యములు నూత్నమృగీమద గంధ చర్చలున్
దినమొక వింతగా మదవతీమణి దిద్దుక యొద్ద నిల్వఁ గ
న్గొని యెనలేని కూర్మి నృపకుంజరుఁ డెంతయుఁ దత్తరింపుచున్. 84

మ. బలిమిం గౌఁగిటఁ బట్టcగాఁ దివురుఁ గోపంబూని కాదంచు రం
తులు గావించి పెనంగినన్ సఖులు దోడ్తో రవ్వ గావింతు రి
క్కలకంఠీమణి చిత్తవృత్తిc దెలియం గారాదు నేనెట్టు లీ
వలవంతం దుదముట్టు వాcడనని లో వాటూరి చింతింపుచున్. 85

వ. అత్తెఱంగునఁ బ్రత్యహంబు నత్తలోదరి హత్తి సేవ గావింపు చున్న నన్నరేంద్ర చంద్రుండు దానిం గవcగూడు కోరిక లీరికలెత్త నెప్పుడెప్పుడని తపకింపుచున్న యెడ నంత నొక్కనాcడు. 86

ఆ. నరుని రూపగరిమ నరులెన్న మునువిందు, నట్టి వేషమితని యందుఁ దోచె
నతcడు రాజు భిక్షుcడగు టెట్లొకరిc బోల, నొకరు లేరె మనుజు లుర్విలోన. 87

క. అని సంశయ మించుకయును, మనమున నిడcగా సుభద్ర మాయా మౌనీం
ద్రున కెప్పటివలె నర్చన, లొనరింపుచుఁ జెంత నొంటి నున్నట్టి యెడన్. 88

శా. భావ ప్రోద్భవ వీరపుంగవుండు శుంభద్భుంభరాలంకృత
జ్యావల్లీ భయదార్భటుల్ నిగుడ మాత్సర్యం బవార్యంబుగా
నా విచ్చుని డాసి యేసెc గదుc బ్రత్యాలీఢ పాదస్థుcడై
పూవుందూcపులు పింజపింజ గరువం బుంద్రేక్షు చాపంబునన్. 89

క. అటువేయ సోలి యతcడ, క్కుటిలాలకc జూచి ముద్దు కోమలి నీ కిం
తటిలోనc బెండ్లి గాcగల, దెటులన్నను దత్ప్రకార మిపుడెఱిcగింతున్. 90

క. రాజ మరాళము నీ పద, రాజీవముc ద్రొక్కి నిలిచె రాజద్గతి నిన్
రాజ శుకము కేల్వట్టెను, రాజానన యివి వివాహ రతి సూచకముల్. 91

గీ. అనిన లజ్జానుమోదంబు లినుమ డింప
మొక మొకించుక వంచి యమ్ముద్దు గుమ్మ
మేటి పగడంపుc గంబంబు మాటుc జేరి
యలcతి తెలినవ్వు దళుకొత్త నిలిచి యుండె. 92

గీ. నిలిచి వీరు మహాత్ములు నేనొనర్చు, సేవ కలరారి యిట్టు లాశీర్వదించి
పలికిరని సంతసిల్లి యక్కలికిమిన్న, చిఱునగవు నెమ్మొగమ్మునc జెంగలింప. 93

గీ. గుత్తపు మిటారిగుబ్బల నొత్తిగిలిన, యుత్తరీయంబు చక్కcగ హత్తుకొలిపి
బెడcగు కెంపులముక్కెర పెదవిcబొదల, నలcతిపలుకులcదేనియల్ చిలుకcబలికె.

ఉ. ఓ యతిచంద్ర మీరు గనకుండు నదీ నగరీ ప్రసిద్ధ దే
వాయతనంబులుం గలవె యారయ నివ్వసుధా తలంబునం
దే యెడనైన భారత కులేంద్రుని నర్జునుc జూచినారె మీ
రాయత సత్కృపా గరిమ నంతయు నా కెఱుcగంగc దెల్పరే. 95

సీ. ఇంద్రనీలపు డాలు నేలు చామనచాయ మేనువాcడలcతి లేcగౌను వాcడు
కొదమతుమ్మెద దిమ్మ నదిలించు సోగపెన్నెరుల వాcడొరపు ముత్తరులవాcడు
మలయు పున్నమచందమామ నెగ్గులువల్కు మొగమువాcడరిది సోయగమువాcడు
తమ్మితేకులcగెల్వc దమకించు నేత్రయుగమ్మువాcడు వెడంద ఱొమ్మువాcడు

గీ. దంబుగలవాcడు బవిరిగడ్డంబు వాcడు, కంబునీకాశ రుచిర గళంబువాcడు
నాకుమేనత్తకొమరుండు నాకవిభుకు,మారుcడర్జునుcడభినవమారుcడతcడు. 96

గీ. అరయ నొక్కబ్దమయ్యెcదీర్థాచరణము, సలుపcజనుcదెంచె నందంద సంచరించి
మరలcజనునెడ నిప్పురమార్గమునను, వచ్చునో లేక యాత్రోవ వట్టిచనునొ. 97

క. అనుడు నతండేమేమీ, నను నడిగెదవా సురేంద్రనందను పై నీ
కనురాగ మింత గలదో, యనుమానము మాని తెలియ ననుమా సుదతీ. 98

క. గోకర్ణ క్షేత్రంబున, గోకర్ణాభరణు శివునిఁ గొలుచుచుఁ గొన్నా
ళ్ళేకతముగ నే నాతఁడు, నేకగ్రీవముగ నుంటి మిభనిభ గమనా. 99

మ. అతులానందమునన్ సమస్త కకుబంతానంత పుణ్యప్రదా
యత దేవాయతనంబులున్ గిరు లరణ్యంబుల్ నదుల్ తీర్థముల్
వ్రత నిష్ఠన్ భజియించుకొంచు నుచిత వ్యాపార మేపారఁగా
నతఁడే మేమయి యున్నవారము సుమీ యంభోజ పత్రేక్షణా. 100

క. ఆ యర్జునుఁ డీ చాయను, మాయాముని వేషమూని మలయుచు నున్నాఁ
డీ యిక్కువ నీ వెఱుఁగవు, గా యొక్కింతయిన మత్త కరివర యానా. 101

గీ. చెలియ యితఁడర్జునుండని తెలిసినపుడె, నాన డెందంబుతోనఁ బెనంగొనంగ
నిచటనిలువకమాటాడకెచటఁజుడిగి,చనియెదోయని సంశయంబెనయుఁజుమ్మి. 102

వ. అని మఱియు సైరింపరాని మోహాయత్తచిత్తంబునం దత్తరింపుచు నిట్లనియె. 103

క. నీ కై వట్టుటకై నే, నీ కైతవ మౌనినైతి నే నర్జునుఁడన్
నా కోర్కి దీర్పు మిప్పుడు, నాకోపమ తనవిలగ్న నాళీకముఖీ. 104

ఉ. చిన్నట నాఁటనుండియును జేడియ నీదగు చెల్మిఁగోరి నే
నన్నలఁ దమ్ములం బ్రజల నందఱఁ బిల్వక గెంటి యొంటి నిన్
గన్నులఁ జూచువేడ్క నిటు కైతవ వేషము వూని వచ్చితిన్
సన్నకసన్న నీ బిగువు చన్నులనొత్తి కవుంగిలింపవే. 105

చ. అని తనరీతి యెల్లఁ దెలియన్వచియించి కవుంగిలింపఁ దా
ర్కొనునెడ నాతి యాతని నరుండని కొంత యెఱింగియుం గటా
మునియని సేవ చేసి కడు మోసముఁబొందితి నెల్ల మానినీ
జనములలోన నేను పలు చందముల న్నగుబాటుఁ జెందితిన్. 106

ఉ. ఇప్పని గాదు పొమ్మనిన నీతని చిత్తము నొచ్చు మీఁదటం
దప్పయి వచ్చు నియ్యకొని తత్పరతం బయికొన్నఁ బెద్ద లే
చొప్పున నెంతురో మదికిఁ జొప్పడదేమియు నంచు సిగ్గునన్
గుప్పున లేచిపోవు నెడఁ గొమ్మ కరాబ్జము వట్టెఁ గ్రీడియున్. 107

క. పట్టిన యంతనె చెలి కటి, పట్టునఁ గట్టిన మెఱుంగు పట్టవలువ చెం
గట్టిట్టుఁ దొలఁగె మొగమున, బిట్టుగ బెట్టిదపు జెమట వెట్టెం బెలుచన్. 108

చ. సడలి వెడంద పెందురుము ఝల్లున వీఁడె నొడల్వడిన్ గగు
ర్పొడిచె నెదం దిగుల్ గదిరెఁ బోవఁగ బోనడుఁగుల్గడుం దడం
బడె వలి గబ్బిగుబ్బ చనుబంతుల మీఁది మెఱుంగు తాపితా
గడితపు నీటు కంచెల వకావక పై పికిలెం దటాలునన్. 109

చ. అపుడు రమాకుమారుఁడు మహోగ్రహజాగ్రదుదగ్ర పుష్పలి
డ్విపుల గుణారవా విరత విస్ఫుర దిక్షు శరాసనంబునం
దపరిమిత ప్రసూన విశిఖావళు లుద్ధతి బూంచియేసె నా
చపల విలోచనామణిని శక్ర తనూజుని జెండుబెండుగన్. 110

క. ఈ రీతి నేయ నతఁడా, నారీ తిలకంబుఁ జూచి నలినానన నా
కోరిక దీర్పక యూరక, గారుడ మొనరించి పోవగా నుచింతంబే. 111

ఆ. చిన్ననాట నుండి మున్ను నిన్నేనును, నన్ను నీవుఁజూచినాము గాము
వినికివలనఁగూర్మి జనియించె మనకిర్వురకును బ్రకటమొప్ప ముకురవదన. 112

క. కావున మనకిర్వురకును, దైవ వశంబునను నేఁడు దార్కొన గలిగెన్
నీవేల జుడిగి పోయెద, వీవేళ మదీయ వాంఛ లీడేర్పఁగదే. 113

క. వింతను గానుగదా నీ, వింతనె విడనాడి పోవ నింతీ వలిపూ
బంతీ సొగసుల దొంతీ, కంతుని దంతీ సమస్త కళలవలంతీ. 114

క. మేనత్త కొమరుఁడను నా, మేనత్తఁగ మేనుజేర్చి మెఱుఁగారెడు నీ
మానికపు మోవి పానక, మాని కవుంగిట సుఖించునటు లొనరుపుమా. 115

క. బాలాబాలా లోలో, త్తాలాలక జాల చాల తాళంజాలన్
జాలంబేలా బేలా, హేలాగతి రతుల దేల్చి యేలుము నన్నున్. 116

చ. కలకల నవ్వవేమి వగఁ గ్రోలఁగఁ గౌఁగిటఁగూర్పవేమి యిం
పలరఁగ బల్కవేమి యధరామృత మానగఁ నియ్యవేమి నేఁ
బిలచిన రావదేమి నను బిత్తరి చూపులఁ జూడవేమి హో
చిలుకల కొల్కి యిట్టులరజేయఁగ నేనొక లాఁతి వాఁడనే. 117

క. అంధుఁడు కైరవిణీ వన, బంధుని రుచిఁ గానలేని పగిదిన్ రతి సం
బంధ సుఖ మెఱుఁగ కళికెదు, గాంధర్వ వివాహ కేళిఁ గలయుము నన్నున్. 118

ఆ. అనుచుఁబెనచుతమినిఁదనుఁజాలఁబ్రార్థింప, మగువమొగమువంచి మాఱువలుక
కున్న దానిచేత నొరపార ముద్దులు, చిలుకఁ బలుకువలఁతి చిలుకఁబలికె. 119

ఉ. నా వలవంత దీర్చు లలనా వలనార నటంచుఁ గోరి నే
వేవిధులన్ వగందగిలి వేఁడిన మోము ముడించి మౌని ము
ద్రావిధిఁబూను మీ చెలియ దాని ననుం గదియంగఁ గూర్చు మా
కేవల తుండకాంతి జితకింశుకమా శుకమా రయంబునన్. 120

క. అని రాజ శుకము బలికిన, విని రాజనిభాస్య దాని వీక్షించి కడున్
వినయము వలంతి తనమును, నెనరు గనంబడగ సాధు నియతిం బలికెన్. 121

క. నాయము గాదుగదా నర,నాయకులకు నిట్టి పనులు ననుఁ దనకు వెసన్
మాయన్నలు తలిదండ్రులుఁ, జేయుదురు వివాహమనుచుఁజెప్పుము చిలుకా. 122

ఉ. నావు దతండు తత్తరమునం జెలికిట్లను నీదు పెద్ద లే
కైవడిఁ బెండ్లి చేసెదరు గ్రక్కున నెక్కడి మాట యిప్పుడే
కావలెఁ గోరుకొన్న పని కాదని నీవు జుడింగి పోయినన్
భావభవ ప్రసూన శర బాధల నెవ్విధిఁ దాళి యుండుదున్. 123

గీ. బాల నన్నిట్టు లలయించ నేల మరుని, పూలకోరుల వెతలకుఁ దాళఁజాల
వైళమున నన్నుఁగౌఁగిటఁగీలు కొలిపి, మేలుదైవాఱ లెంకగా నేలుకొనుము. 124

ఆ. అనుచుఁ జెందుకొనెదునపుడందియలు మ్రోయ, హంసశాబకంబు లరుగుదేర
జెలులువచ్చిరంచుఁ జేసన్నఁజూపి కేల్పట్టుఁ దప్పఁద్రోచి పడఁతి పఱచె. 125

క. ఈ పగిది కింకిణీమణి, నూపుర రావములు చెలఁగ నునుఁగొప్పు విసన్
జూపుల జంకెనలెనయఁగ, నా పూవుంబోడి చనియె నంతఃపురికిన్. 126

గీ. అపుడు నృపమౌళిగుండె జల్లనఁగ నోలి, నెమ్మొగంబున దైన్యంబు నివ్వటిల్ల
నుమ్మలింపుచు బెగ్గిలి యుస్సురనుచుఁ,గంజముఖిఁబల్కె గద్గదకంఠుఁడగుచు. 127

క. నిలు పోకుపోకు బాలా, వలచితి నే నీకుఁజాల వంచన యేలా
చలమెదఁ బూనుట మేలా, తలిరాకు కటారి కూళఁ దలఁపుము బేలా. 128

క. నెనరొాదవ నన్నుఁ గౌఁగిటఁ, బెనచి సుఖింపక మొఱంగి బిరబిర నెటకోఁ
జనఁజూచె దహహ మరుక్రొ,న్నన ములుకుల పాలఁ జాల నలిగెదవు సుమీ. 129

క. మగువా పెంచిన వని ప,న్నగభుక్శుక శారికలను నమ్మి చనకు ము
న్నుగ దైవబలము దప్పినఁ, బగవారై యుంద్రు ప్రాణబంధువులైనన్. 130

వ. అని యివ్విధంబున. 131

క. సాధుగతి నరుఁడు వేఁడిన, నా ధవళేక్షణ మొఱంగి యటఁ జని మదన
వ్యాధా సాధారణ శర, బాధా గాఢాబ్ధి మునిఁగి పస చెడి యుండెన్. 132

వ. అని శౌనకాది మహర్షులకు రౌమహర్షిణి యెఱింగించిన వారాతని నవ్వలి కథా
విధానం బెట్లని యడుగుటయును. 133

చ. వనజభవాది కాఖిల సుపర్వ గణావన విశ్వ భావనా
సనక సనందన ప్రముఖ సన్ముని రంజన శత్రు భంజనా
ఘన కరుణా రసాప్లుత వికస్వర లోచన పాప మోచనా
ప్రణత సుధీ జనానిశ విభాస్వ దనుగ్రహ దారు విగ్రహా. 134

క. అవిరత వితత చతుష్ష, ష్ట్యవసర నైవేద్య ఖాదనామోద రథో
త్సవ ముఖ వివిధోత్సవ వై,భవ విలసిత ధామ పతిత పావన నామా. 135

భుజంగప్రయాతము.

హరీ దేవతాధ్యక్ష యంభోరుహాక్షా
దరీ సర్వ లోకేశ దైత్య ప్రణాశా
కరీంద్రావనోపాయ కారుణ్య గేయా
ఝరీ విస్ఫురత్పాద సమ్యగ్వినోదా. 136

*ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపానిరీక్షణ సంలబ్ధ సారకవితావిచిత్ర*
*కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర*
*సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ నామధేయ*
*ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను*
*శృంగారరస ప్రబంధంబునందుఁ*
*జతుర్థాశ్వాసము*

# పంచమాశ్వాసము

శ్రీరాజిత నిజసౌధా, గ్రారూఢ మహాసుదర్శనాంచల వీక్షా
దూరీకృత భవపాశా, సార కృపావేశ నీల శైలనివేశా. 1

వ. అవధరింపుము నైమిశారణ్య మహర్షులకు రౌమహర్షిణి యిట్లని చెప్పందొడంగె నట్లు
సుభద్రాభద్రేభయాన పట్టు దప్పించుకొని యరిగి యంతఃపురంబు ప్రవేశించిన. 2

గీ. అంతట దురంత చింత నక్కుంతి సుతుఁడు
కంతు కుంతాయిత లతాంత కాంతనిష్కు
టాంతర నితాంత కాంతి సంక్రాంత చంద్ర
కాంత మాణిక్య వేది నంగంబుఁజేర్చి. 3

చ. ఉసురుసురంచు సొమ్మసిలు నుమ్మలికంబునఁ దల్లడిల్లు లోఁ
గసరుకొనున్ దిశల్ వెదకుఁ గన్నులు మూయు వడంకు బెగ్గిలున్
దొసఁగులఁ గుందుఁ దాపమునఁ దూపిలు విస్మృతిఁ జెందుఁ గాసిలున్
బసచెడి తూలు జాలిఁగొను బాప విధీ యటు చేసితే యనున్. 4

చ. మదవతి వచ్చెనంచుఁ బెనుమక్కువఁ గ్రక్కున లేచి నల్దిశల్
వెదకు వితాకుఁజెందుఁ బలవించుఁ గనుంగవ నశ్రుబిందువుల్
వదలక చిప్పిలన్ మొగము వంచి కృశించుఁ జలించు హాయనున్
మదన కిరాత శాత సుమమార్గణ నవ్య శరవ్య చిత్తుఁడై. 5

వ. మఱియు నాత్మ గతంబున. 6

ఉ. నున్నని సోగ పెన్నెరులు నువ్వు విరిన్నగు నాస సిబ్బెపుం
జన్నులు ముద్దునెమ్మొగము సన్నపు కౌను వెడంద కల్కి వా
ల్గన్నులుఁ దళ్కు చెక్కులు నిగారపు కెందలిరాకు మోవియుం
గన్నులఁ గట్టినట్లయగుఁ గన్నియ నెన్నఁడుఁ జూడఁగల్గునో. 7

సీ. చిలుక పటాణి తేజీ వజీరుని విరజాజిపూ చికిలి కైజారు సౌరు
మీఱు నిద్దాపదియాఱు మేల్వన్నె బంగారు సలాక చెంగలువ మోఁక
నిండు పున్నమనాఁటి పండువెన్నెలనిగ్గు మినుకారు తొలుకారు మెఱుఁగుఁదీఁగె
కడిఁది నెత్తావి నున్గన్నె గేదఁగి పువ్వు తేట గొజ్జంగి పూనీటి కొలఁకు

గీ. చలువ చెలువంపు జక్కొరల్ చిలుకుఁ బలుకు
తలిరు విలుఁదాల్పు బలువేలు కలికి చేతి
కలికి రాచిల్క నెఱమానికముల మూట
దానిఁ గవఁగూడ కే జాడఁ దాళువాఁడ. 8

సీ. చిలుకు చిల్కునఁదేనె చిలుక ముద్దులు గుల్కు చిలుకకుఁ బద్దెంబు చెప్పునేర్పు
కరతాళ గతుల వేసరక మయూర సంఘములకు నాటలుగఱపు నేర్పు
మించు నెయ్యమున రాయంచకూటువులకుఁ దీరుగా నడకలు దిద్దు నేర్పు
తనియ మేఁతలువెట్టి నెనరొప్ప శారికా సంచయంబులఁ బలికించు నేర్పు

గీ. చెలిమి దైవార శృంగార కలనమీఱఁ, జేరి సారెకుఁ బరిచర్య సేయు నేర్పు
నిబ్బరంబొప్ప నబ్బాల కబ్బెనౌర, దానితోఁ బొందు నేనెట్లు మానియుందు. 9

క. ఆ చిన్ని చన్నుగవ చెలు, వా చిఱునగు మోము గోము నా చూపుల కో
పా చెక్కుటద్దముల పస, నా చిత్తములోన నొక క్షణముఁ బాయదుగా. 10

సీ. దాని ధమ్మిల్లాంబుధర లీల పర్వక యతను తాపాగ్ని చల్లారఁ గలదె
దాని కెమ్మోవి సుధారసం బానక సూనాశుగ వ్యాధి మానఁ గలదె
దాని ముఖేందు సందర్శనం బొదవక మదనాంధకారంబు వదలఁ గలదె
దాని నిర్భర పయోధర దుర్గమబ్బక స్మర బలోగ్ర భయార్తి సడలఁ గలదె

గీ. దాని యశ్రాంత సాంగత్య తరణిలేక, భూరి విరహాంబునిధి దాఁట దారిగలదె
యంచు మదినెంచుఁదలవంచు సంచలించు,ఘోరమారవికారాప్తిఁగుందికుంది. 11

శా. నీహారాంశుముఖీ కదంబక మణిన్ నే గోరి సన్యాసినై
యూహారాది విధానముల్ మఱచి యత్యంతానురాగంబుతో
బాహాలింగన సౌఖ్య వాంఛ మదిలోఁ బాటిల్ల నే నుండుచో
నాహా యిట్లర చేసి యేగితె సుభద్రా భద్ర కుంభస్తనీ. 12

శా. రావే చిల్కలకొల్కి రావె లలనా రావే జగన్మోహినీ
రావే పూర్ణ సుధాకరోజ్వల ముఖీ రావే కురంగేక్షణా
రావే నీల ఘనాఘనాభ చికురా రావే లతాంగీమణీ
రావే నన్నలయించకే యనుచు లో రాగిల్లి పల్కుం దమిన్. 13

వ. అని యనివారిత మదనోన్మాదంబున లేచి యేచిన తమకంబునఁ జేత నాచేతన
జ్ఞానంబు మఱచి తరు లతా గుల్మాదులం గనుంగొని. 14

సీ. మవ్వంపు నెత్తావి పువ్వుగుత్తులు సూచి భామ గుబ్బలటంచుఁ బట్టఁబోవు
లతికాగ్రయుత మధువ్రతరాజిఁగని బాల నీలవేణియటంచు నివురఁదివురుఁ
దరుణ రంభాస్తంభతతులు నిరీక్షించి చెలువ యూరువులంచుఁ జేరఁబాఱుఁ
ఘన వనప్రియ కుహూకారంబు లాలించి వెలఁదియెలుంగని వినఁగఁగోరు

గీ. నిరత నిరవద్య నిబిడ నిర్నిద్రకాద్ర
మకర కేతన శిఖి శిఖా నికర దహ్య
మాన మానసుఁ డగుచు నుద్యాన తరు వి
తానములఁ ద్రిమ్మరుచుఁ దహతహలు నిగుడ. 15

క. నే డాసి కరము వట్టిన, నేఁడా సీమంతవతి గణింపక యెంతో
వ్రీడ నెడఁబాసి యేఁగుచు, నీడా నీనీడ వీడ కేతేరదుగా. 16

క. కాంతా లలామ నాపైఁ, గాంతాళము వూనికాదు కాదని వడి నీ
చెంతకు రాదుగదా మన, సెంతయుఁ గలఁగంగఁ జూచె హింతాళంబా. 17

ఉ. లుంగములార భూరి ఫలలోల నితాంత వినమ్ర కమ్ర నా
రంగములార సార సుమరాజి విరాజిత మల్లికా మిళ
ద్భృంగములార సౌరభ పరిస్ఫుట పద్మవనీ విహార చ
క్రాంగములార మీరలు రథాంగ కుచన్ గనరే కురంగటన్ 18

క. బాలా కుచమృగ మదజల, హేలారతినేలు మనుచు బతిమాలిన న
న్నేలా లతాకుడుంగము, హేలాగతిఁ బెనఁగి చెనఁగనేలా చెపుమా. 19

సీ. మీ ఫలంబుల బోలు మెఱుఁగు గుబ్బల ముద్దుగుమ్మఁ గానరె గజనిమ్మలార
మీ క్రొన్ననలఁగేరు మిసిమి వాతెర రాచకొమ్మఁ గానరె దాసనమ్ములార
మీ తేకులనుమించు మించుఁగన్నుల పైఁడిబొమ్మఁ గానరె కమ్మదమ్మలార
మీ వాసనలమీఱు మేని తావుల పూవుఁగొమ్మఁ గానరె చందనమ్ములార

గీ. మావులార చొకారంపు మోవులార, దాఁకలార యనంటి క్రొంమోఁకలార
మల్లులార చలన్నాగవల్లులార, చూడరే మీరు తలిరాకుఁ బోఁడి నిందు. 20

సుగంధి. జాలమేల బాలఁ జూపు సాలమా రసాలమా
తాళఁజాల మాలతీ లతావృతాళి జాలమా
వాలుఁగంటి జాడఁజూడవా వనీ తమాలమా
నీలవేణిఁ గానవోటు నీవు నేఁడు తాళమా. 21

వ. అని యగ్గలంబగు విరహావేశంబునఁ గందర్ప చంద్ర మందానిల కలకంఠాదులం గుఱించి. 22

సీ. కురులచే నీ వింటి గుణభంగ మొనరించు భామినిఁ గానవా పంచబాణ
మోముదామరను నీ గోము డీలుగఁ జేయు సుందరిఁ గానవా చందమామ
వాలు కన్గవను నీ వాహనంబును గేరు మదవతిఁ గానవా మలయపవన
గళరవంబున నిన్నుఁ గాదని వాదించు కోమలిఁ గానవా కోకిలంబ

గీ. పగ గలుగు దాని నేచంగ బలములేక, మీరలిందఱు గుమిఁగూడి కేరుకొనుచు
వనములోఁదద్వియోగార్తి వనరుచున్న, నన్నుఁదబ్బిబ్బుఁగావింప నాయమగునె. 23

వ. అని యిట్లు నవనవావస్థలం దగిలి పొగలుచుండి యెట్టకేలకుఁ దెలివిఁ దెచ్చుకొని.

ఉ. అద్దిర యొద్దఁజేరి వినయమ్మున సేవ యొనర్చుచుండ న
మ్ముద్దుల గుమ్మ సౌరుగని మోహము వుట్టి కరంబు వట్టినన్
గద్దరి మాటలాడి చనఁ గాదని బల్మి రమింప నైతి నా
బుద్ధికి మోసమయ్యెఁ జెలి బూమెలు పన్నె నిఁకేమి సేయుదున్. 25

క. అని మిక్కిలిఁ గాసిల్లుచుఁ, దనువెల్లను వెల్లవోవఁ దహతహ నిగుడన్
గననయ్యె నరుండపు డ,ర్జున నామము సార్థకముగ సొంపరి యుండన్. 26

క. ఆ తీరు తెలిసి రుక్మిణి, ప్రీతిన్ భోజన మొసంగఁ బ్రియమున నది తాఁ
జేతన్ ముట్టఁడు మెసఁగడు, నాతి సుధారసము గ్రోల నాటిన ప్రేమన్. 27

క. ఇది రాతిరి యిది పవలు మ,ఱిది సంజ యటంచు నెఱుఁగ కింద్రసుతుం డా
సుదతీమణి సొగసంతయు, మదిఁ దలపోయుచు విరాళి మఱుఁగుచునుండెన్. 28

క. అట నంతిపురి సుభద్రా, కుటిలాలక నరుని చెలువు కూరిమితో హృ
త్పుటమున మఱిమఱి నెన్నుచుఁ, బటుతర సుమచాపతాప పరవశయగుచున్. 29

క. సొమ్మసిలుఁ దెలియుఁగాసిలుఁ, బిమ్మటఁ గొనుఁ జెలులఁగసరు బెగ్గిలు వగచున్
హుమ్మనుచు వెచ్చ నూర్చున్, నెమ్మొమొక్కింత వంచి నెఱిఁ గ్రసియించున్. 30

సీ. పరపుపై నిడ్డ సంపంగిపూవులు చూచి కనలు నిప్పుకలంచుఁ గళవళించుఁ
జనుదోయి నలఁదిన చందనంబీక్షించి క్రొత్త సున్నమటంచుఁ దత్తరించు
నురమున నునిచిన విరిసరంబులు గాంచి పెనుబాములనుచు బీతునఁజలించుఁ
బయిపయిఁ జల్లిన పన్నీరుఁగనుఁగొని వేఁడినూని యటంచు వెతఁ గృశించుఁ

గీ. గడిమి యడరంగ నుడుగక కుడియెడమల బడిబడిఁ గడిందిగా వడివడినిఁబఱపు
చెఱకు విల్కాని విరితూపు సెకలఁగ్రాగి వేఁగి లోలోఁగి వీగి యత్తిఁగఁబోఁడి. 31

వ. మఱియుం దనలోన. 32

ఉ. అక్కట నేను గోరిన శుభాంగుఁడు నన్ను వరించు వేడుకన్
మక్కువ పిక్కటిల్ల యతి మాడ్కిని దగ్గఱ వచ్చి వేఁడినన్
జిక్కని గుబ్బచన్ను లెదఁ జేర్చి కవుంగిటఁ గూర్చ కూరకే
చిక్కులఁబెట్టి వచ్చితిని సీ యతఁడెంత విరాళిఁ దూలెనో. 33

గీ. కటకటా నేఁడు పచ్చ విల్కానిఁగేరు, నా మనోహరమూర్తి నన్నరుని నొంటి
నుపవనంబున మరుచెఱ నుండఁజేసి, యేల గికురించి వచ్చితి బేల నగుచు. 34

ఉ. ఎంత మనోభవార్తిఁ గృశియించెనొ యెంత దురంత చింతచే
స్వాంతమునం గలంగెనొ భయంపడి యెవ్వరి నెంత వేఁడెనో
యెంత గయాళి యంచు నను నెగ్గులు వల్కెనొ యాతఁడక్రమై
యెంతయు నామదిం దిగులు హెచ్చెనహో యిఁక నేమి సేయుదున్. 35

క. ఎప్పటివలె సేవకుఁ బోఁ, దప్పగుఁ బోకున్న నిలువఁ దరమె పయిపయిం
గుప్పిళ్ళకొలఁది గుప్పెడు, నప్పచ్చని వింటిజోదు నలుగుల సెకలన్. 36

చ. కలుగునొ కల్గదో పెనఁగి కాదని వచ్చిన తప్పుదీఱఁ గ్రొం
దలుకు కడాని జీనిపని దంతపు మంచము మీఁద వేడుకం
గలుగుచు నా మిటారి చనుగుబ్బల కొద్దిఁగవుంగిలించి యా
చెలువుని కాత్మఁ బందువుగఁ జేయు నదృష్టము నాకు దైవమా. 37

క. ఆ వగ యాజిగిబిగి మే,నా వాలుంగన్ను దోయి యానవ్వు మొగం
బేవేళ నా మనంబునఁ, దావలమై మఱపురాదు తాళం దరమే. 38

క. అక్కట యక్కురు వీరుని, యక్కున జిగిచన్నుఁదోయి యదురంటంగా
నొక్కుచు రతిఁ బెనఁగని నా, చక్కదనంబేల యుదుటు జవ్వనమేలా. 39

చ. ఎటువలె నోర్చి యుందు నిఁక నెవ్వరి నే బతిమాలుకొందు హృ
త్పుటమునఁ జిందు మార పరిపూర్ణ శరానల మెట్లు డిందు ను
త్కట విరహోప తాపమడఁగన్మతి యెయ్యది మందు దైవమా
కటకట వాని పొందు వెసఁగల్గునొ కల్గదొ యెట్లు కుందుదున్. 40

వ. అని మఱియు నమ్ముద్దుగుమ్మం గమ్మవిల్కాఁడు వాడిమీఱఁ గరాళ మరాళ కీర శారీ మధుప్రతాన్య భృత కేకి ప్రముఖానేకానీకినుల నంచెలంచలం గాపువెట్టి, యుద్దండ మండిత ప్రచండ పుండ్రేక్షు కోదండ దండంబఖండ పరాక్రమంబున నెక్కువెట్టి, బిట్టు మొఱయించి, చేకొద్దిగ నుద్దవిడింజిమ్ము క్రొమ్మెఱుంగు కమ్మదమ్మిపూటమ్ము మొత్తములు ఱొమ్మున నొక్కుమ్మడిం గాడిపాఱిన సొమ్మసిలి, మేలు దప్పిన జాళువాబొమ్మ పోలిక ననల్ప మణిగణ ప్రభాభాసమాన హంసతూలికా తల్పంబున మేనుజేర్చి కొంతసేపునకుం దెప్పరిలి. 41

క. హరహర! పరిచర యుతుఁడై, మరుఁడేఁచఁగఁ జొచ్చె నాస మాని వనికిఁ జె
చ్చెరనరిగి నరుఁగుఱిచి మెయి,దొరఁగినఁ బరలోకసుఖము దొరకునటంచున్. 42

క. చకచక లీన్మణి మంచపు, సెకల పయిం జేతులూని సీత్కృతు లదరన్
మొక మొక యించుక జుమ్మనఁ, దెకతెక నొడలుడుక లేచి దీనత మీఱన్. 43

క. అడుగులు దడఁబడ బిగిగొ, న్గడగడ వడఁకన్ నిడూర్పు గాడ్పులు వొదలన్
గడితపు వల్వ చెఱఁగు ముసుం, గిడి సాహసమూఁతగాఁగ నేఁగెన్ వనికిన్. 44

వ. అట్లేగి. 45

సీ. చలువ పుప్పొడి సారువుల వెంటఁజనిచని తప్తవాలుక లంచు దల్లడిల్లు
లతికల చెంత మెలంగుచుఁ బైరాలు ననలంగజుని తూఁపులని చలించుఁ
బొదలవెంబడిఁబోవఁబొదవు తేంట్లఁదుపాకి గుండ్లంచును దలంకి కుందుచుండు
గుజ్జమావులఁజేరి కొరలు కెందలిరాకు లెరగలి మంటలం చెదఁ గలంగుఁ

గీ. గొమ్మలందుండి మత్త పుంస్కోకిలంబు, లేచి కూసినఁ బుష్పనారాచ వీర
కాహళారావము లటంచుఁ గళవళించు, వనజదళనేత్ర శృంగార వనములోన. 46

సీ. చిగురాకు జొంపంపు జీబుమామిడి నీడ దూరుఁ గార్చిచ్చులో దుముకు కరణి
గడితంపు విరిదీఁగ మెడఁజేర్చుకొను బిట్టు కినుకతో నురివెట్టు కొనెడుమాడ్కి
మేటి గొజ్జంగి పూనీటి కేళాకుళి వడిఁజొచ్చు మున్నీటఁ బడెడు పగిదిఁ
గమ్మ గేదగిఱేకు ఱొమ్మున నానును కుకటారిచే వ్రచ్చుకొనెడు పోల్కెఁ

గీ. బత్రపుట్టి కాంతంబునఁ బట్టి తీయ
తేట పూదేనె గుటుకునఁ దివిరి త్రావు
కించుదనమున విస మారగించు సరణి
మేనుఁ దొరఁగంగఁ బూని యమ్మెఱుఁగు బోఁడి. 47

గీ. అట్లు మారణకర్మంబు లవిరళముగఁ, జేసి యొక్కింతయును గీడుఁజెందకున్న
విసిగి వేసరి యవ్వనవీధి నొక్క, తలమునందైనఁ గాలూన నలవి గాక. 48

ఉ. కన్నియ కన్నె మావి వలి గుప్రపనంటుల దండ దిండుగాఁ
బన్నినదాఁక పందిరుల పజ్జలఁ గొజ్జఁగి నీటియేటి పొం
త న్నునుగున్న సంపెంగల దాపున నిద్దపు చందమామ ఱాఁ
దిన్నియపై నొడల్ వయిచి తీవ్ర మనోజ వికార వేదనన్. 49

గీ. పొరలుచున్నంత విరులుపాన్పున నెలంత, గానరాకున్నఁ దత్తరంబూని బోఁటు
లెల్ల గుమిగూడుకొని నగరెల్ల వెదకి, విన్నదనమున బెగ్గిలుచున్న యెడల. 50

గీ. రాచిలుక వచ్చి యచ్చిన్ని రాచ కన్నె
యంగజ వ్యథఁ బూఁదోఁట కరిగి నట్టి
చంద మెఱిఁగింప హా యెంత సాహసంబు
చేసె చెలియంచుఁ బలిచి యచ్చేడెఁ గాంచి. 51

క. వలగొని సంపెంగలును జెం,గలువ విరుల్ బడిసివైచి కపురంపు రజం
బళికమున రాచి పైపై, వల గొజ్జఁగి నీరుచల్లి వచియించి రొగిన్. 52

క. అమ్మకచెల్ల గయాళి త,నమ్మున మము మొఱఁగి యిట్లు ననదోఁటకు వే
ళమ్మున రాఁదగవగునే, కొమ్మా ముమ్మరపుటార్తిఁ గుందుచు మిగులన్. 53

ఉ. మేలి పసిండి చాయ నును మేను వియోగ మహోగ్రహవ్య భు
క్కీలలఁ గ్రాల బేలవయి కేవల సాహస వృత్తి నొంటిమై
వ్రాలని హాళితో నిటులు వత్తురె యివ్వన మంతకాకరా
భీల విశాల శాతశర బృంద నిషంగమటం చెఱుంగవే. 54

క. జాతి విరోధి వసంతుఁడు, భూతము పవనుండు జుట్టుపులుగు శిఖి మనో
జాతుఁడు మారకుఁడిక మఱి, యే తీరున నిలువనిత్తు రిందఱు నొకటై. 55

క. తుమ్మెదలు గ్రమ్ముకొని జుం,జుమ్మని మ్రోయున్ మరాళ శుక పిక నికరం
బిమ్మడిఁ గూయం గొమ్మా, మమ్మారే వనుము శత్రు మధ్యంబు గదా. 56

సీ. మత్త మధువ్రత మంజులారావముల్ వీణారవంబులా వెలఁది నీకు
విప్పారు నిద్దంపు పుప్పొడి తిప్పలు పూవులపాన్పులా పొలఁతి నీకుఁ
గుసుమాసవస్ర-ద్గుంజానికుంజముల్ కేళీగృహంబులా బాల నీకుఁ
గొలకొలమని మ్రోల మెలఁగు రాచిల్కలు నెచ్చెలికత్తెలా నెలఁత నీకు

గీ. గమ్మ కపురంపు పెనుదుమారమ్ము జిమ్ము
తెమ్మెదలు మేలి సురటులా తెఱవ నీకు
విరహ మంతంత కెగcజేయు వీని చెంత
కేల వచ్చితి వమ్మ యీ వేళ కొమ్మ. 57

క. రామా నీ కిటువలె గా, రామా నీ చెప్పినట్లు రామా మే మా
రామాంతరముల మెలcగుట, రామా యుచితంబె యింక రా మా తోడన్. 58

వ. అని యనునయింపుచు నా సఖీజను లబ్బాలికా మణిం దోడ్కొని వచ్చి క్రమ్మఱ నిజ
నివాసంబునం జేర్చి రా సమయంబున. 59

గీ. సమయనర్తక హస్తాంబుజాత గళిత, కలిత కాంచనమణి కందుకం బనంగ
బంధుజీవక రుచిలోక బాంధవుండు, రమణ దళుకొత్త నపరవారాశిcగ్రుంకె. 60

క. వరుణ వధూటి సఖీజన, పరివృతయై చల్లులాడు బగ్గుండి యనన్
సురుచిర తేజంబున నం,బర తలమున సాంధ్యరాగ పటలి దనర్చెన్. 61

చ. రవియను కెంపు బంతి ప్రజ రంజిల మున్ సమయైంద్రజాలికుం
దవిరళ లీల నాడి యది యంతట మాయము చేసి చంద్రుcడన్
ప్రవిమల వజ్రకందుకము గ్రమ్మcగ జూపcగ నీలి దుప్పటిన్
గవిసెన వేసెనోయనcగ గాఢ తమిస్రము పర్వె రోదసిన్. 62

చ. మతి చెడి తూలు జాలిగొని మగ్గము లోపలి నాడె పోలికన్
గుతల నభోంతరాళమునc గ్రుమ్మరుc గ్రమ్మరి దమ్మి పొన్ను పై
వెతకు వెతంగలంగుc గదు విన్నదనంబున లోcగి వేcగు హృ
త్పతి జత వాసి కోకసతి బాష్ప జలాకుల లోచనాంతయై. 63

క. చరణము లటునిటుc దడcబడ, వరశబ్ద స్ఫురణ లేక వైవర్ణ్యంబున్
బెరయు నొక కోకి వడిచెడి, కరమరుదుగc గుకవి రచిత కావ్యము వోలెన్. 64

క. తనపతి యగు నినుc డంబుధి, మునిcగిన నలినీ వధూటి మోము ముడిచి రో
దనమొనరించె ననంగా, వనజంబులc తేటి కూటువలు కదు మొరసెన్. 65

క. కుదురుగc జుక్కలు మిక్కిలి, పొదలెం దటి యనెడు కాcపు పొరిcబొరిని వియ
త్పద కేదారాంతరమున, వెదcజల్లిన తెల్ల జొన్న విత్తులనంగన్. 66

గీ. ప్రాగ్దిశా కాంత శశిని గర్భమునఁ దాల్ప
నంతకంతకు నెల లెక్కి యాననంబు
తెలుపు వాఱినదో యనఁ దేట మీఱి
యుదయనగమునఁ బాండిమం బుదిత మయ్యె. 67

సీ. తూరుపు దెస నెలంతుక కేలు కెందమ్మిఁ బసనెసంగెడు కెంపు బంతి యనఁగఁ
బొడుపుగుబ్బలి కడ కడలి నెన్నడు చక్కిఁ గొఱలువారపు టగ్గి కుప్ప యనఁగఁ
దొలుగడ జేజేల దొరసాని మేడపైఁ గుదురు కొల్పిన పైఁడికుండ యనఁగ
రే మెఱుంగుం బోఁడి మోమున దిద్దిన చక్కని చింద్రింపుఁ జుక్క యనఁగఁ

గీ. గటికి చీకటి గౌరులఁ గడకుఁదఱుమ, వేగఁ బఱతెంచు తఱియను వేటకాఁడు
నెఱయగ్గైఁబట్టు నిప్పులకొఱవియనఁగఁ,బ్రాబ్బగంబుననిందుబింబంబుపొడమె. 68

క. దిటముగ నప్పుడు రజనీ, విటుమేనన్ లాంఛనంబు విలసిల్లెఁ బరి
స్ఫుట కోకనదాంతరమునఁ, బటుగతి విహరింపు చున్న భ్రమరంబనఁగన్. 69

క. ఇందీవర బంధుం డా,నందము డెందమున నెనయ నవ్వుచు రజనీ
సుందరిమేన నలందిన, చందన గంధం బనంగఁ జంద్రిక మెఱసెన్. 70

క. అప్పుడు సుభద్ర చంద్రుని, దప్పక వీక్షించి కుసుమ ధన్వికిఁ దోడై
గుప్పున శశి పొడమె నహో, విప్పులపై బిట్టు నెయ్యి నించిన భంగిన్. 71

క. అని యక్కుమారికా మణి, వినువీధిం జేరి వెండి వెన్నెల పైఁబై
నెనయించు నన్నిశాకరుఁ, గనుఁగొని నిందింపఁ దొడఁగె ఘనవిరహార్తిన్. 72

క. కువలయ మిత్రుండనినినుఁ, గువలయమునఁగలుగు జనులు గొనియాడుటకుం
దివురొదవఁగఁ జక్రంబుల, నవలామిన్నలఁ గలంప న్యాయమె చంద్రా. 73

క. వలనొప్ప మహాదేవుని, తల యెక్కితినంచు నిక్కెదవు గాని యతం
డలుక నిలంబడఁ దన్నిన, కలఁక మదిం దలఁచుకొనవు గద హరిణాంకా. 74

సీ. బహుపరశ్రుతిశాస్త్ర పారగుండగు గురు పడఁతుక నెనసిన పాతకంబు
సోదరియగు నిందిరాదేవి యింటి లక్ష్మిని ముచ్చిలించిన కిల్బిషంబు
దారల నందఱిఁ దగనొక్క తీరుగాఁ గాంక్షించి ప్రోవని కల్మషంబు
కోకదంపతుల డాకొననీక యెడఁబాసి దొసఁగులఁ బెట్టిన దుష్కృతంబు

క. క్రచ్చుకొని మింటఁ జంద్రుఁడు, విచ్చలవిడి బైల నీవు వెంబడి మరుఁడున్
హెచ్చి సెక చల్లుచును ము,చ్చిచ్చుం గూడితిరిఁకేమి సేయుదుఁ బవనా. 91

చ. బలసి వియోగినీ జనులపై విసమూదఁ దలంచి కానిచో
నలఘు విభావిభాసిత లయావసర స్ఫుట విస్ఫులింగ సం
వలయిత వీతిహోత్ర పరివర్ధిత హాలహల ప్రచండ కుం
డలి ముఖ గహ్వరాంతరమునం జొరనేటి కిఁకన్ సమీరణా. 92

వ. అని యనిలుం బలికి మఱియును. 93

క. కరమార్తింబెనచెదు కని,కర మావంతయును లేక కాముక హృద్భీ
కరమా కొరమాలిన మధు,కరమా పరిచిత సమస్త కమలాకరమా. 94

క. కమ్మ విలుకాఁడు పాంథుల, నమ్ములనేయంగ నతని కనుగుణముగ ఝుం
ఝుమ్మని మొరసెద వకటా, తుమ్మెద మధుపాన రతుఁడు దుర్మతి గాఁడే. 95

క. కలకాలంబును నిన్నొక, చెలికత్తియ మారుగాఁగఁ జేపట్టుట కి
ట్లులుకార మరుని గూడుక, చిలుకా మామీఁద వెగటు చిలుకందగునే. 96

క. పలుగాకి మూక లోపల, మెలఁగినగుణ మేరుపడఁగ మిన్నక యెంతో
చలమార నిటుల మముఁ గో,కిలమా వెతనిడుట నీకుఁ గేవల ఫలమా. 97

క. కలహంసల రవములకున్, వలగొని కాళ్ళఁబడు వర్తనము మఱచి యహో
కలహంసములార యిటుల్, కలహమునకుఁ గాలు దువ్వఁగా నుచితంబే. 98

వ. అని మధువ్రత కీరాన్యభృత కలహంసంబులం దూరుచుండె నయ్యెడ. 99

శా.కారంబయ్యె నితంబినీ మణి కలంకారంబు రోలంబ ఝుం
కారంబున్ సమదోగ్ర కోకిల కుహూకారంబుఁ జంద్రోద్ధతా
కారంబున్ గుసుమాస్త్ర చాపగుణ టంకారంబు రాయంచ క్రేం
కారంబున్ శుకశారికా నికర హుంకారంబు ఘోరంబుగన్. 100

వ. అప్పుడబ్బాలికాచూళికాభరణం బాసఖీజన కదంబంబు నీక్షించి యిట్లనియె. 101

సీ. నా మాఱుగా మీరు వేమాఱుఁ బ్రోవుఁడీ సఖులార యీ కీర శాబకముల
నేఁబెంచినట్లుగా నిచ్చలుఁ బెంచుఁడీ చెలులార యీ లతావళుల నెల్ల
నే దిద్దు కైవడి నేర్పున దిద్దుఁడీ యనుఁగులార నెమళ్ళ కాట లెపుడు
నేఁ జేయులాగున నెమ్మదిఁ జేయుఁడీ చెలికత్తెలార బొమ్మలకుఁ బెండ్లి

గీ. యాత్మ నిఁక మీరు నామీఁది యాస వదలి సంతసంబున నే నాడు సౌధవీథిఁ
గేళి గావింపుచుండుఁడీ లీలమీఁఱ బలిమి నిటుసేతుసని వేఱె తెలుపనేల. 102

క. అని కజ్జల జలధారలు, కనుదమ్ములఁ దొరఁగి చన్నుగవ దిగఁజాఱన్
ఘనరోదన మొనరించెడు, వనజాననఁజూచి చెలులు వగచుచుఁ దమలోన్. 103

క. ముంద రెఱుంగక మనవా, రిందుముఖినిఁ దపసి చెంత కెటులంపిరొ కా
మందులు మంత్రంబులు పలు,చందంబులఁ గ్రియలుగలవు జడదారులకున్. 104

క. అన్య మెఱుంగని గోలం, గన్యక నిటు వెఱ్ఱిగొలిపెఁ గాఁబోలు కటా
యన్యాయ మంత్రవాదులు, సన్యాసులు వారితోడ సఖ్యము దగునే. 105

వ. అని పలికి. 106

గీ. ఈ విధంబెల్ల రుక్మిణీ దేవి మొదలు, గలుగు శుద్ధాంత సతులకుఁ దెలిపి చలువ
పనులుచేయంగవలెనని పఱచి తెలుప,వారలరుదెంచి చెలియున్నతీరుఁగాంచి. 107

సీ. మొగము వెల్వెలఁ బాఱె ముద్దరాలి కిదేమి చిత్రమంచు వచించె మిత్రవింద
యతిసేవ సేయఁబో నతఁడేమి యంత్రము చేసెనోయని గేలి చేసె భద్ర
కళవళంబున బయల్ గౌఁగిలించె నిదేమి చందమోయని కేరె సత్యభామ
పిలిచినఁ బలుకదు తలఁపెందు నిలిపెనో తెలియరాదని పల్కె నల సుదంత

గీ. జాంబవతి కన్ను గిలిపె లక్షణ హసించె, మేలమాడెను గాళింది గోల కెన్ని
బూమెలొదవించెనిదె యనె భోజకన్య, ముద్దుమఱఁదలి వలవంత సుద్ది దెలిసి. 108

గీ. అపుడు చెలికత్తియలు వారి యనుమతమున
వేదనలఁ గుందుచును బాన్పు మీఁదఁ బొరలు
బాలికామణిఁ జూచి హా గోలకిట్టి
యార్తి యుదయించెనే దైవ మనుచు వగచి. 109

సీ. అడుగులఁ గెంజిగురాకులు హత్తించి కురులపైఁ బుప్పొడి గుస్తరించి
గబ్బి చన్గుబ్బల గంధసారమలంది కన్నుల వలిగమ్మ కపురమూఁది
నునుబెండొడల నంటి ననదొనల్ గదియించి యురమున ముత్తెపు సరులువైచి
భుజముల బిసకాండములు దవుల్కొనఁ జుట్టి నెమ్మేన గొజ్జంగి నీరు చిలికి

గీ. తలిమమున మల్లె విరులు రాసులుగఁ బోసి తరుణ రంభాదళోశీర తాళ వృంత
సముదయంబులవీఁచి యజ్జలజముఖులు చెలికి శిశిరోపచారముల్ సలుపుటయును.

సీ. చనుదోయి నలఁదిన చందన గంధంబు పొడిపొడియై రాలి బూదియయ్యె
గళమున వైచిన బలుముత్తియపు సరుల్ పెటపెటల లాజలై పేలఁదొడఁగె
నెమ్మేనఁ జిలికిన కమ్మగొజ్జఁగి నీరు వెసఁగ్రాఁగి చూత్కార మెసఁగ నింకె
భుజములఁ జుట్టిన భూరి పంకజ నాళ వలయముల్ గడువాడి వత్తులయ్యె
గీ. మనసిజాతోగ్రగారుడ మాంత్రికుండు,యువతిహృదయాంబురుహవీధి నవఘళించి
కాంచువారికిఁ గనుకట్టుఁగట్టి విద్దె, లాడెననఁదోఁచెఁ దద్వియోగాగ్ని వలన. 111

వ. వెండియు నబ్బోఁటికత్తియ లబ్బోఁటికి శిశిరోపచారంబుల సేదఁదీర్చి మనోభవాదుల నుద్దేశించి యిట్లనిరి. 112

సీ. హరిణాక్షి యీబాల నాదరంబునఁ జూచి కావుమీ యిపుడు రాకాశశాంక
హరిమధ్య యీ యింతి గురుభక్తిఁబ్రోవుమీ వంచన సేయక పంచబాణ
యగ్ని శిఖాంక యీ యబలతో నేస్తంబు గావింపు చుండుమీ గంధవాహ
ఘనవేణి యీరామ గారాము మీఱంగ నాడుచుండుము నెమ్మి యలర నెమ్మి
గీ. పద్మినీమణి యీకొమ్మ పజ్జనుండి, పాట పాడుచనుండుమీ తేఁటిరాయ
యనుచు హిమకర మకరకేతన సమీర బర్హిణంబులఁబల్కి యప్పద్మముఖులు. 113

సీ. కుసుమాస్త్రుఁడత్యంత గుణవంతుఁడగుటెల్ల మధుపంబులార మీ మహిమఁ గాదె
వలతేని కెక్కుడు బలముచేకూరుట రాచిల్క లార మీ ప్రతిభఁ గాదె
యతనుండు ప్రద్యుమ్నుఁడై పేరుగాంచుట రాజ నీ తేజోభిరతిని గాదె
భావసంభవుఁడు సజీవుఁడై మెలఁగుట పవమాన నీ మహాప్రౌఢిఁ గాదె
గీ. మీరు నలువురునెప్పుడు మీనుసిడము, దయ్యమున కేడుగడయునై తనరువారు
వారిజాతాక్షినలయింప వలదటంచుఁ, జెప్పఁగారాదె యిప్పుడా చిత్తజునకు. 114

వ. అని ప్రార్థించి సుభద్రం గనుంగొని. 115

సీ. వర్ణనీయ గిరీశ వక్షోరుహవు నీవు వలరాజు నీచెంత నిలువఁగలఁడె
భీమ విక్రమ బలరామ సోదరివీవు కోయిలల్ నీదండఁ గూయఁగలవె
యనుపమాన విలాస ఘనకైసికవు నీవు హంసముల్ నీయొద్ద నాడఁగలవె
రామణీయ భుజంగ రోమరాజివి నీవు చలిగాడ్పు నీ పజ్జ మలయఁగలదె
గీ. మోహనోత్ఫుల్ల కాంచనామోద వీవు, తుమ్మెదలు నీకురంగటఁ ద్రుళ్ళఁగలవె
మగువ యీవేళనీకింత తెగువయేల,నిండువేడుక మదిఁబూని యుండవమ్మ. 116

చ. పలుకులఁ జిల్కలం జికుర బంధముచేత నెమళ్ళఁ దళ్కు చూ
పుల పసలం జకోరములఁ బొంకపు గుబ్బలఁ జక్రవాకులన్
గళరవ మాధురి న్మదపికంబుల నెన్నడ నంచ బోదలం
గెలిచితి వింతి నీకు నివి కీడిఁక నెట్లొనరింపఁ జాలెడిన్. 117

ఉ. ఏమిటి కింత చింత విను మెల్లి జగజ్జనులెల్లఁ జూడఁగా
రాముఁడు కృష్ణుఁడుం జెలిమి రంజిల నీకును సవ్యసాచికిన్
బ్రేముడిఁ బెండ్లి చేసెదరు పెక్కు తెఱంగుల నంత మీఁద నో
కోమలి నీవు నీ విభుని గూడి సుఖించెదభీష్ట లీలలన్. 118

గీ. అనియనుఁగుఁజేడెలూరడించిన నొకింత,వంతఁదెగఁద్రోచి యన్నిశాకాంతవదన
స్వాంతమునఁగొంతదిటమూని సవ్యసాచి,పైఁదలంపిడియుండె నప్పట్టునందు. 119

గీ. విరహిణీ పాంథజనులపై వేటఁలాడి, గెల్పుఁగొని యేఁగుచో మీనకేతనుండు
హోళిఁబట్టించు వీరకాహళియనంగఁ,గుక్కుటముగూసెఁగుక్కురొకోయటంచు. 120

గీ. చక్ర విద్వేషి వైన దుర్జనుఁడ వీవు రాత్రివా యిందు నిలువంగ రాదు తొలఁగు
మనుచు జంద్రునకెఱిఁగింప నినుఁడుపంచు దూతియన వేగుజుక్క ప్రాదుర్భవించె.

చ. చలువల తేదు జాఱె తొగచాన ముడుంగఁగ బాఱెఁ జీఁకటుల్
బిలముల దూఱె తిక్కగమి విన్నన దాఱె విటీ విటాలికల్
బులుపులు దీఱె తమ్మివిరి బోఁడికి వేడుకటూఱె దిగ్గనన్
బలబల తెల్లవాఱె బహుపక్షి రవంబులు మీఱె నయ్యెడన్. 122

క. సురవర దిక్తరుణీ మృదు, కర సంభృత పద్మరాగ కలశంబనఁగా
నరుణ విభాభాసురుఁడై, హరిదశ్వుఁడు పూర్వశిఖరి యందుదయించెన్. 123

గీ. అప్పుడు సుభద్ర చెలులు రయంబు నరిగి, దేవకికి రోహిణికి రుక్మిణీవధూవ
తంసమునకును సత్యకాతరుణి తెఱఁగు,మంతనంబున నెఱిఁగింపనంతవారు. 124

క. గుసగుసలఁబోయి యప్పని, వసుదేవున కెఱుఁగఁజెప్పి వనితామణికిన్
వెసఁగొందఱఁజెలులందో,డొసఁగి యరయుచుండి రిటఁబయోజాక్షుండున్. 125

క. చెలియలికి మేనమఱఁదికి, జెలిమి మెయింబరిణయంబు సేయఁగఁ దనలోఁ
దలఁచి నిజాగ్రజు చేతన్, సెలవు వడసి ద్వారవతికిఁ జెచ్చెఱ వచ్చెన్. 126

క. ఒకరొకరికిఁ జెప్పక సా,త్యకియును బ్రద్యుమ్న సాంబు లక్రూరుఁడు పౌం
డ్రకరిపు పిలుఁదనె వచ్చిరి, చకచకితమణీ శతాంగ సంయుతులగుచున్. 127

చ. అటువలె వచ్చి శౌరిగనె నాత్మమణీమయ సౌధవీధికా
తట వనవాటికాంతర నితాంత వికస్వర పుష్పమంజరీ
పటల నటద్ద్విరేఫ రవ బంధుర బాలరసాల మూల వి
స్ఫుట మదనోపతాప పరిశోషిత గాత్రుని బాండుపుత్రునిన్. 128

క. కని డాయనరుగ నరుఁడపు, డనుమోదము నయముభయమునతివినయంబున్
నెనరును నానయు మనమునఁ, బెనఁగొన నెదురేగి పాదపీఠిన్ వ్రాలెన్. 129

క. వ్రాలిన నగి లేలెమ్మని, కేలుగవన్ గుచ్చియెత్తి కేవల కరుణన్
లాలించి చెట్టబట్టుక హాళిన్ దోడుకొని చనియె నంతఃపురికిన్. 130

గీ. అందుఁ గనకాసనంబున నధివసించి, కొంతసేపటు సరస సద్గోష్ఠి సలిపి
యన్నపానాదివిధులచే నలరఁజేసి, వసనమణిభూషణాదికం బొసఁగియునిచె. 131

వ. అని నైమిశారణ్య మహర్షులకు రౌమహర్షణి యెఱింగించిన వారలతని నవ్వల కథా
విధానంబెట్లని యడుగుటయును. 132

శా. ఇంద్రానేకపహార నారద భుజంగేంద్రామృతాభ్రాపగా
చంద్ర ప్రస్తర కాశ కుంద శశభృచ్చక్రాంగ తారాభ ని
స్తంద్ర ప్రస్ఫుటకీర్తి శోభిత నితాంత ప్రాభవాలంకృతా
యింద్రద్యుమ్న మహాసరోవర తటీ హేలావిహారోద్ధతా. 133

క. అర్జున పరిపాలన యమ,ళార్జున పాదప విభంజనామోద నవీ
నార్జున పరిధాన నితాం,తార్జున కీర్తి ప్రకాశ హరి జగదీశా. 134

పంచచామరము. భుజంగరాట్ఛయానయోగి పుంగవప్రపూజితా
గజేంద్రరక్షణ ప్రవీణ ఖండితా హితాసురా
వ్రజాంగనా ముఖారవింద వాసవాది నాయకా
నిజాంఘ్రి సేవకానుమోద నీల శైలమందిరా 135

ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపానిరీక్షణ సంలబ్ధ సారకవితావిచిత్ర
కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర
సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ నామధేయ
ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను
శృంగారరస ప్రబంధంబునందుఁ
బంచమాశ్వాసము

# షష్ఠాశ్వాసము

శ్రీమహిళాన్విత వక్షా, ధీమజ్జన కల్పవృక్ష దితిజ విపక్షా
సోమార్యమాక్ష రక్షిత, సామజకుల దక్ష నీలశైలాధ్యక్షా. 1

వ. అవధరింపుము శౌనకాది మహర్షులకు రౌమహర్షణి యిట్లని చెప్పఁదొడంగె నట్లర్జును నుచిత ప్రకారంబున నాదరించి యునిచి గురు పురోహితామాత్య బంధుజనంబులం బిలిపించి మధుమధనుండు మంతనంబున న్నిట్లనియె. 2

క. ఇతఁడు మనసుభద్రకునై, యతివేషము దాల్చి యున్న యర్జునుఁడు సమం
చితవిధి వీనికిఁ బరిణయ, మతులగతిం జేయ వలయునని తెలిపివెసన్. 3

క. మంచి ముహూర్తము దెలిసి స,మంచితగతిఁ బురము నగరు నలరం గైసే
యించి తలిదంద్రులను వీ,క్షించి రహస్యంబుగా వచించెన్ వేడ్కన్. 4

క. తన శిష్యుఁడు కురుపతి యా,యనకు సుభద్రకును బరిణయము సేయు తలం
పుననుండు హలి యతండెటిఁ,గినఁ గవ్వడి కీయనీఁడు కినుక దలిర్పన్. 5

చ. అని వసుదేవ దేవకుల కర్మిలిదెల్పి వివాహకృత్యముల్
పనుపడ వేగఁ జేయుఁడని పల్కిన వారలు సమ్మతించి య
ర్జునునకు శోభనోత్సవము సొంపుగఁజేయఁ వలంతులైన జ
వ్వనులను గొందఱిం బనుప వాసవి చెంతకు నేగి వారొగిన్. 6

చ. చకచకితేంద్ర నీలమణి జాల సముజ్జ్వల కంకణ ధ్వనుల్
ప్రకట గతిం జెలంగఁగ నలంతికవున్ వసియాడ నిద్దపున్
మొకమున ఘర్మబిందువులు ముంపఁ జనుంగవ విఱ్ఱవీఁగఁగా
సకియల మిన్న యోర్తు వని సంపఁగి నూనెఁ దలంటెఁ గ్రీడికిన్. 7

క. భుగభుగలీనెడు నభినవ, మృగమదమున నలుఁగువెట్టె మెలఁతయొకతె య
న్నగ విద్వేషణ సూనున, కగణిత శృంగార లీల లలరారంగన్. 8

క. కలకంఠి యోర్తు మణిమయ, కలశంబులచే సువర్ణ ఘటవన్నీరం
బులు దొరపి జలకమార్చెను, బొలుపారఁగఁ బాండురాజ పుత్రున కెలమిన్. 9

సీ. తడియొత్తె నొక్క యుత్పలపత్రలోచన చలువలందిచ్చెఁ బైదలి యొకర్తు
నిలువు టద్దముఁజూపె జలదవేణి యొకర్తు తిలకంబు దిద్దె నుగ్మలి యొకర్తు
సిక పొంకముగవైచె ముకురానన యొకర్తు బురుసారుమాల్‌చుట్టె బోఁటి యొకతె
మణిభూష లలరించె నణువలగ్న యొకర్తు గంధంబలఁదె గజ గమన యోర్తు
గీ. పృథుల కళ్యాణమయ భద్రపీఠి మీఁద, నధివసింపంగఁ జేసె లతాంగి యొకతె
సురటివీఁచె నవామృతాధరయొకర్తు, మోహనాకారుఁడగు శ్వేతవాహనునకు. 10

వ. ఇవ్విధంబున నలంకృతుం జేసి యిట్లనిరి. 11

క. కుండికయును శాటియును ద్రి,దండమ్మును విడిచి దివ్యతర విగ్రహుఁడై
కొండల పగతుని కొడుకిపు, డండజ వాహనుని సుతుని యట్లలరెఁగదా. 12

ఉ. నిచ్చఁ గృతోపవాసముల నెమ్మెయిఁ గ్రాఁగ మనంబు దద్దయుం
బచ్చని వింటిజోదు సుమబాణ పరంపర చేత వేగ వే
వచ్చి మనంబులో విరహ వహ్నిఁ దపించుచు నుండునట్టె వి
వ్వచ్చున కెంత పెండ్లికళ వచ్చెను నేఁడని యాడి వేడుకన్. 13

క. భద్రేభయాన లెల్ల సు,భద్రం గైసేయఁబూని బాలికఁ గని శుం
భద్రాజ వదన నేఁడిట, భద్రంబగు నీకు దివిజపతి సూనునకున్. 14

సీ. అత్త యయ్యెను దయాయత్త మానసయైన కుంతిభోజన్నృపాలు కూర్మిపట్టి
బావలైరి మహాప్రభావ విక్రమ ధర్మవర్తులు ధర్మజ వాయుసుతులు
పతియయ్యె దివిజసంస్తుత శౌర్య గాంభీర్య సౌందర్యధుర్యుఁడౌ శక్రసుతుఁడు
మఱఁదులైరి విరాజమాన దాన క్షాత్ర మహనీయ గుణులైన మాద్రిసుతులు
గీ. అహహ నీభాగ్య మేమని యనఁగవచ్చుఁ, గోరినట్లనె యిపుడు చేకూరె మంచి
కాఁపురంబబ్బె నీసాటి గలరె చెలులు, భాసురోదార గుణభద్ర యో సుభద్ర. 15

వ. అని పొగడి. 16

క. సొంపలరెడు జిగిగుబ్బలు, పెంపెసలాడంగ నీవి బిగిసడల నొడల్
గంపింపఁగ నొక చేడియ, సంపెఁగ నూనియఁదలంటెఁ జంద్రాననకున్. 17

సీ. మృగమద చందన మిళితకర్దమమున నలుఁగిడె నొక మంద నాగయాన
కలయ గంధామలకంబిడె నొఁదలఁ దలఁకొని యొకముద్దు తలిరుబోఁడిఁ
గొజ్జంగి పూనీటఁగూర్చి యొప్పుగ జలకములార్చె నొక్క పంకరుహ వదన
గడితంపుఁ బెన్నెరు లొడలును బిరబిరఁ దడియొత్తె నొక్క యుత్పలదళాక్షి

గీ. చలువ చెలువంపుఁబసిఁడి దువ్వలువఁగట్టి, నొసఁగెనొక తప్త చామీకరోపమాంగి
జిల్గునిద్దంపు జలతారు జీబురవికె, దొడిగె నొకకొమ్మ యారాచ తొయ్యలికిని. 18

గీ. గొనబుమీఱెడు నిడువాలు కురులుదువ్వి, తనర సిగవైచి పసిఁడి గేదంగి ఱేకు
లిరవుపడఁగట్టె సంపెంగ విరులదండ, చుట్టెనొక నీలయలివేణి సోమముఖికి. 19

క. అలికమున నొక వధూటీ, తిలకము కస్తూరిరేఖ దీరిచె నొక యు
త్పలపత్రనేత్ర వాలుం, దెలి కన్నులఁ గజ్జలంబు దిద్దెం జెలికిన్. 20

గీ. కప్పురము సాంకవమ్మును గంధసార, మగరుతట్టు పునుంగును మృగమదంబు
కుంకుమంబును బన్నీటఁగూర్చిమెదిచి, నెమ్మెయినలందె సతికొక్క నీరజాక్షి. 21

క. ఇరవొప్పఁగ నవరత్నా,భరణంబులు దొడిగె నొక్క భామామణి హె
చ్చరికఁ బదార్వన్నియ బం,గరు బొమ్మందెగడు నా జగన్మోహినికిన్. 22

ఉ. ఆ లలితాంగి మేన సకలాభరణంబుల కంటెఁ దద్దయున్
లీలఁ దనర్చె జవ్వనము లేమకు వేనలి యంతకంటె ను
ద్వేల విలాస వైఖరులఁ దేజరిలెం గొనబారి యోర యి
ల్లాలికిఁ గొప్పు తల్లియని యాడెడు సామెత నిక్కువంబుగన్. 23

వ. ఇవ్విధంబున వధూవరులం గైసేసియున్న సమయంబున. 24

సీ. తొలుదొల్త దివిసముజ్వల భూరిమందారనగ సుమామోదంబు గుబులుకొనియె
నావెన్క దివిజ శంఖాణక ఝల్లరీ భేరీరవంబులు భోరు కలఁగె
నా పిఱుందను సురత్నాలంకృత సువర్ణ దివ్య విమాన ప్రదీప్తు లలరె
నా తరువాత ప్రయాత దేవవ్రాత శాత హేతిద్యుతుల్ చౌకళించె

గీ. నంత రంభా తిలోత్తమాద్యమర వార, కామినీ వారలాస్య క్రియా మృదంగ
నాదముల్ వినఁబడియె ననంతరమున, బహుళ గంధర్వ జయజయధ్వనులునిగుడె.

క. ఆ పిదప వెల్లయేనుఁగ, యాపై నింద్రుండు శచి జయంతుఁడును మహో
ద్దీపిత వైభవమొప్పఁగఁ, జూపట్టిరి నరులు చూచి చోద్యపడంగన్. 26

క. ఈ కరణి నంబరము డిగి, పాకారి సమస్తజనులు ప్రణతులొనర్పన్
శ్రీకరమగు హరి పురమున, కా కవ్వడి పెండ్లిసేయ నర్మిలి వచ్చెన్. 27

క. వచ్చిన జిష్ణుని కృష్ణుఁడు, మచ్చికఁబూజించె నతని మగువలు శచి భా
స్వచ్చరితం బూజించిరి, విచ్చలవిడి మానసముల వేడ్కలు మీఱన్. 28

క. సురలను దత్సుతులను దగు, వరసంబూజించి వారివారికి మణిమం
దిరములు హరి విదుదులిడెన్, నరుఁడనుపమ భక్తి మ్రొక్క నాకవిభుందున్. 29

క. దీవించి శిరము మూర్కొని, కేవల కరుణారసంబు గీల్కొనఁదగ సం
భావించి దివ్యమణి భూ,షా వసనాదికము లొసఁగి చక్కటి నునిచెన్. 30

వ. అంత. 31

క. తనవంశ సంభవుండును, దనుబోలిన రూపసియు నుదారుఁడు నగు న
ర్జును పెండ్లి చూడవలెనని, చనుదెంచె ననంగ మింట శశియుదయించెన్. 32

గీ. అపుడు మురదానవారాతియనుమతమునఁ, బరిణయోత్సవకృత్యముల్ సరవిఁజేయ
సతులు పురుషులు నతులితోత్సాహలీల, వెలయ నంతఃపురంబున నేపుమీఱి. 33

సీ. పంచవాద్యంబు లుదంచిత గతిమ్రోయ నుల్లభంబులలోన నొరపు మెఱయ
ధవళాయతాక్షులు ధవళముల్ వాడుచుఁ గులదేవతను దెచ్చి నిలిపిరింట
నైరేనిఁగొనివచ్చి యతివలు గొందఱు సంఘటించిరి పెండ్లి చవికె లోనఁ
బెండ్లికొమరునకుఁ బెండ్లికూఁతురికిఁ గైచేసిరి ముత్యాల బాసికంబు

గీ. లంతలోన విశారదుఁ దరుగుదెంచె, నెలమి దైవారఁ బరిచర బలముగొలువ
సకల తైర్థిక భూసుర సహితుఁడగుచు, బలనిషూదన తనయుని తలఁపెఱింగి. 34

క. సుమహూర్త సమయమయ్యెను, గొమరునిఁదోడుకొని యెదురుకొనవలెఁబదమా
యమరాధిప యని సురగురుఁ, దమలమతింబలుక నింద్రుఁడపుడు కదంకన్. 35

సీ. దివినుండి తెచ్చిన దివ్యరత్న కిరీట హారాంగదాంగుళీయక మనోజ్ఞ
కంకణ కుండల గ్రైవముఖాఖిలా లంకరణంబు లలంకరించి
కల్పతరూజ్ఞాత కలిత ప్రభోపేత కనక దుకూలముల్ గట్టనిచ్చి
ప్రత్యగ్ర సౌరభ భ్రాజమానానూన మందార కుసుమ దామములు వైచి

గీ. గాటముగ మేనఁజందన గంధమలఁది, కడిఁది ముత్యాల చౌడోలి గ్రాలనలరు
నభ్రదంతావళము మీఁద నక్కుమారు, నధివసింపంగఁజేసి యుదగ్రలీల. 36

సీ. దేవదుందుభులు సాంద్రీభూతముగ మ్రోయ సమధిక తూర్యనాదములు చెలఁగి
రంభాద్యశేషాప్సరః కదంబంబాడఁ గరదీపికా సముత్కరము వెలుఁగఁ
దుంబురు నారదాదులు గీతములువాడ హరిదధీశులు బరాబరు లొనర్ప
దివిజర్షి సతులు ముత్తెపు సేసప్రాల్ చల్ల గురువశిష్ఠులు శుభోక్తులు పఠింప

గీ. గరుడ గంధర్వ యక్ష కిన్నర నిలింప, సిద్ధ విద్యాధరోత్తముల్ చెంతనడువ
నసదృశామోదమేదుర స్వాంతుఁడగుచు, సురవరేణ్యుండు పెండ్లికిఁదరలివచ్చె. 37

గీ. దివ్య మణిభూషణాంబర దివ్యగంధ, దివ్యమాల్యాదికంబులఁ దేజరిలుచు
వాసవుని దండ నుచ్చైశ్రవంబు నెక్కి, తరలి వచ్చె జయంతుఁడుద్దామలీల. 38

శా. భేరీ కాహళికాది వాద్యములు ప్రస్ఫీతస్థితిన్ మ్రోయఁగా
వారస్త్రీలు నటింప భట్లు పొగడన్ వాహద్విప స్యందన
స్ఫారానేక వరూధినుల్ గొలువ శుంభల్లాంఛన శ్రేణి పెం
పారన్ సూరెల దివ్వటీల్వెలుఁగ నత్యైశ్వర్య గర్వంబునన్. 39

శా. ప్రద్యుమ్నుండును సాంబ సాత్యకి గదుల్ బంధుల్ దొరల్ ప్రెగ్గడల్
మాద్యద్దంతుల నెక్కి తోఁజన మహా మాణిక్య భూషా రుచుల్
ఖద్యోత ప్రతిమాన దీప్తి వెలుగం గౌతూహల స్వాంతులై
చోద్యంబొప్పఁగ నేగుదెంచి రెదుటన్ క్షోణీధరారాతికిన్. 40

సీ. ఉత్తమాంగంబున నుదయార్కు బింబోపమంబైన మణి కిరీటంబు వెట్టి
కర్ణద్వయంబునఁ గనక రత్నాంకితోజ్వల కుండలములు చెల్వలరఁబూని
వక్షస్థలంబున నక్షుద్రరుచి దీప్యమాన కౌస్తుభ మహామణి ధరించి
కరముల శాత్రవోత్కర భయంకర దివ్య శంఖచక్రములు హెచ్చరికఁ దాల్చి

గీ. కటితటంబునఁ గళ్యాణపటము గట్టి, సైన్య సుగ్రీవ మేఘపుష్పక వలాహ
కములఁ బూన్చిన తేరెక్కి కమలనాభుఁ, డెదురుగానేగె దేవతాధీశ్వరునకు. 41

క. అటులెదురేగి శతాంగము, తటుకునఁడిగి దివిజ విభునిఁ దత్తనయునిఁ గౌఁ
గిటఁబెనచి గంధవీటీ, పటవాసాదికము చేత బహుమానించెన్. 42

క. సురవరుఁడటులనె శౌరిం, బరితోషితుఁ జేసి ప్రేమఁబలికెన్మును సో
దరుఁడవు నీవిప్పుడు మా, కరయంగా నల్లుఁడైతి వయ్య ముకుందా. 43

క. అని సరసోక్తులు నెఱపుచు, వనరుహనాభుండు దివిజ వల్లభుఁడును న
ర్జును దోడ్కొని సరభసగతిఁ, జనిరి వివాహావసథము చక్కటికెలమిన్. 44

సీ. అచ్చట దివిషద్గజాధి రాజము డిగ్గి ఘనరత్న సంఘ సంఘటిత నూత్న
పాదుకల్ దొడిగి యప్పార్థుఁ డంతిపురంబు చెలులెదురేతెంచి చెలువుమీఱ
నారతులియ్యంగ నల్లనల్లనఁ జని దక్షిణ పదము ముందరగ గడప
దాఁటి నానామణిస్థాపిత మణి సౌధకక్ష్యాంతరంబులు కడఁకఁగడచి

గీ. దినకరోపమ దీప్తి దేదీప్యమాన, మానితామూల్య నిస్తుల మంజులాబ్జ
రాగమాణిక్య దీపాభిరామ హేమ, మయ సముద్దామ కల్యాణమంటపమున. 45

గీ. సురలు మునులు మహీసురుల్ ధరణివరులు
నుచిత సింహాసనములఁ గూర్చున్న యెడల
బహుళ మాణిక్య మయ శుభావహ సువర్ణ
పీఠిఁ గూర్చుండెఁ గ్రీడి సంప్రీతి నపుడు. 46

క. గురు గర్గ విశారదు లురు,తర మోదము తోడ మంత్రతంత్ర విధులు వా
విరి సలుపుచుండి రపుడ, ద్ధరణీసురవరుల యనుమతంబున నరుఁడున్. 47

గీ. సరభసంబుగ మంగళస్నాన మాచ,రించి పూతాంబరములు ధరించి కనక
కౌతుకాంకిత పాణియుఁ గౌతుకాభి,రామ మానసుఁడై యుండె రహిదలిర్ప. 48

శా. సైరంధ్రుల్ రమణీయ వస్త్ర మణిభూషాగంధ మాల్యాదులన్
దోరంబొప్పు నలంకరించి కడు సంతోషంబు దీపింపఁగాఁ
బేరంటాంఢ్రును దారు సేసలిడుచున్ బ్రేమంబు రెట్టింపఁగ
న్నారత్నంబును దోడి తెచ్చిరి వివాహ ప్రస్ఫుర ద్వేదికిన్. 49

గీ. గరిమతో నప్పుఁడవ్వధూ వరులఁ గనక
పీఠముల మీఁదఁ గూర్చుండఁ బెట్టి నడుమఁ
దెర యమర్చినఁ గొందఱు తీఁగబోఁడు
లతులి తామోద మొదవ నయ్యవసరమున. 50

క. మధుమధన జనకుఁడర్మిలి, మధుమదనాకృతిఁదనర్చు మఘవసుతునకున్
మధుగుడ జీరక మిశ్రిత, మధుపర్కమొసంగె ముదిత మానసుఁడగుచున్. 51

గీ. తొగయనుఁగు మానికపుగిండితోడ మంచి, తావిపన్నీరు దేవకీదేవి వోయఁ
కనకపాత్రికలోఁగాళ్ళుగడిగి మామ, యల్లునకు ధారవోసెఁగన్యకను బ్రేమ. 52

క. వనితలుగొందఱు తెర వం, చినఁబొలిచె సుభద్ర నిబిడ జీమూతాచ్ఛా
దనమెడలి యొఱపు నెఱపుచుఁ, గనఁబడు నిద్దంపు శిశిరకర రేఖయనన్. 53

మ. కనియెం గవ్వడి కౌతుకాభియుతుఁడై కన్యాజన గ్రామణిం
గనకాంగిం గలహంసపోత గమనం గంజాత పత్రేక్షణం
గనదిందీవర నీల నీల చికురం గస్తూరికా సౌరభం
గనకోద్యత్కలికాభ నాసఁ గఠినగ్రావోపమాన స్తనిన్. 54

చ. తళుకు బిసాళి వాలుగను దమ్ములొకించుక విప్పి కన్యకా
తిలకము గాంచె నీలమణి దీధితి జాల మనోజ్ఞ గాత్రునిన్
బలవదరాతి జైత్రుని గృపాపరిపూరిత నేత్రునిన్ సమా
కలిత విలాస చైత్రుని జగన్నుతి పాత్రుని బాండుపుత్రునిన్. 55

చ. నగరిపు నందనుండు చిఱునవ్వు మొగంబునఁ జెంగలింప మే
న్గగురుకొనంగఁ గేల్గవ చొకారపు సిబ్బెపు గబ్బి గుబ్బ చ
న్మొగడలు మోవఁ జూచి యనుమోద మెదం జిగురొత్త నత్తఱిన్
మగువ గళాగ్రభాగమున మంగళసూత్రముఁ గట్టె నేర్పునన్. 56

క. తరుణీలలామ శిరమున, నరుఁడున్ నరు మస్తకమున నారీమణియున్
విరివిగ ముత్తెపు తలఁబ్రాల్, పరఁగించిరి చూపఱకును బ్రమదంబెసఁగన్. 57

వ. మఱియు నగ్ని ప్రతిష్ఠాపనాది విధానంబు లాగమోక్త ప్రకారంబునం గావించి పంచ వాసరంబులు గడపియున్న యా దంపతుల దీవించి గమనోన్ముఖులైయున్న మఖ ప్రముఖ నిఖిల బర్హిర్ముఖులకు గురు వశిష్ఠ ప్రముఖర్షివరులకు గురు బంధు నృప బుధార్థిజనంబులకుందగిన యుడుగరలొసంగి యరుంధతీ శచీప్రముఖ దివ్య పురంధ్రీ మణుల బహూకరించి యథాస్థానంబులకుం బనిచి మురాంతకుండంతట. 58

సీ. వెలలేని రతనంపు బలురవణంబులు నంచిత చీని చీనాంబరములు
పసిఁడి పళ్ళెరములు పచ్చులపల్లకీల్ మందసల్ ముత్యాల చందువాలు
పట్టెమంచంబులు పరపులు బాలీసులపరంజి గద్దియ లడపములును
జాలవల్లికలు నుయ్యాల మంచంబులు నిలువుటద్దములు పన్నీటి గిండ్లు

గీ. జాలువా కీలుబొమ్మలుఁ జామరములు, జేవదంతపు దూవెనల్ చిలుక పంజ
రములు కస్తురిబరిణెలు రాంకవములు,చెలియలికినిచ్చె నరణముల్ కొలఁదిమీఱఁ.

క. ధన కనక భూషణాంబర, ఘనతర చతురంతయాన కరి తురఁగ స్యం
దన శస్త్రాస్త్రాదికములు, మనసిజగురుఁడపుడు మేన మఱఁదికి నొసఁగెన్. 60

వ. అట్లొసంగి యర్జునుంజూచి నీవు వధూసమేతుండవై వైళంబ యథాస్థానంబునకుం జనుమని యానతిచ్చిన నతండు సుభద్రాసమేతుండై యమ్మహామహునకు మ్రొక్కు లొసంగి వసుదేవ దేవకీ రోహిణులకు రుక్మిణీ సత్యభామాది సతీమణులకుఁ దక్కిన బంధుజనంబులకు వందనంబులుగావించి వారలచేత దీవనలుగైకొని యనుజ్ఞాతుండై కనక రథారోహణంబుఁజేసి నిజనగర మార్గంబు వట్టి. 61

క. సతి మనమలరంగ నరదము, జతురతఁబరపుచును జనెడు సమయమున జగ
న్నుత బలుఁడు పృథుశ్రవసుం, దతుల చమూగజతురగ సమన్వితుఁడగుచున్. 62

చ. తెలతెలవాఱ వచ్చె నిదె తేరుపయిన్ వసుదేవ కన్యకా
తిలకమునుంచి యర్జునుఁడు ధీరతఁ దొంగిలి యాత్మ పట్టణ
స్థలమున కేగఁ జాగెను మదంబున వీరలఁ బోవనిచ్చినన్
హలియునుఁ గృష్ణుఁడున్ మనలనందఱ నేరము లెన్నకుందురే. 63

క. అని యోధులుఁ దానొక్కట, ననివారిత రోష మాత్మలందు నిగుడఁగా
ననిసేయఁగ సమకట్టిరి, యనిమిషపతి సుతునితోడ నారని కడిమిన్. 64

క. అప్పుడు సుభద్ర వారల, చొప్పుఁదెలిసి విభుని లగ్గుఁ జూపులచేతన్
గుప్పునఁ గనుఁగొని మదిలో, ముప్పిరిగొను కూర్మి ముద్దుముద్దుగఁ బలికెన్. 65

క. బలదేవుని పంపున నురు, బలయుతులై యోధవరులు పటువేగమునన్
బిలబిలవచ్చిరి యరదము, నిలుప వలయునింక ధారుణీ నాథమణీ. 66

ఆ. తేరు గడపనేర్పె శౌరి బాల్యమున నా, వదిన సత్యభామ వలనుమీఱ
వింటినేయ నేర్పె వినుఁడు బాలనటంచు, నన్నుఁజుల్కఁజూచి నవ్వవలదు. 67

క. అని ధైర్యస్థైర్యంబులు, వినయము సిబ్బితియుఁ గూర్మి విస్తరిలఁగఁ బ
ల్కిన జేజేదొర కొమరుఁడు, మనమలరఁగఁ గౌగిలించి మానిని కనియెన్. 68

ఆ. మేలు మేలు బాల యాలంబుసేయనీ, కేల లీల రథముఁ దోలు మేను
వాలుఁదూపు గముల నీలచేలు బలంబు, నేలఁగూలనేతు వైళమునను. 69

క. మరుబలములకున్ వెరచితిఁ, దరుణీ యిన్నాళ్ళ దనుకఁ దగనిప్పుడు నీ
పరిరంభ కవచమబ్బెను, మరుబలమును పరులబలము మఱి లక్ష్యంబే. 70

క. పరచక్ర విజయలక్ష్మీ, గురుకుచవగు నీ కటాక్ష గుంభన దగులన్
బరచక్ర విజయలక్ష్మీ, పరమాతిశయంబు నాకుఁ బ్రాప్తముఁగాదే. 71

గీ. రథముఁ దోలుము నీ మనోరథ మదేల
కాదనఁగ వలె నేరుపు గడలు కొనఁగ
ననుచుఁ జతురోక్తు లాడి బాణాసనాశు
గములుఁ గైకొని సంగరోత్కంఠుఁ డగుచు. 72

క. విల్లెక్కువెట్టి గొనయము, పెల్లుగ మొఱయించి యార్చి బిరబిర నరదం
బల్లనఁ జననిమ్మని యా, హల్లకదళ పాణి నాడి యరిగెదు నెడలన్. 73

చ. నిలునిలు పోకుపోకు రమణీమణిఁగొంచు నిఁకెందు బోయెదీ
వలఘుతర ప్రతాపఖని యైన హలాయుధు బంట్ల మేము నిన్
జలమును లావు శౌర్యమును సాహసమున్ గడు నగ్గలంబుగాఁ
గలన నెదిర్చి యోర్చక సుఖస్థితి నూరక పోవ నిత్తుమే. 74

చ. అనుచు దురాగ్రహంబున భయంకర హుంకృతు లొప్పఁ గుప్పునన్
సునిశిత బాణజాలములు శూరతనేసినఁ గ్రీడి వానిఁ దు
త్తునియలు జేసి వాడి బలుదూపులు వీరభటాశ్వదంతి సం
హననములందు దుస్సి చన నగ్గలికం బరఁగించి యార్చినన్. 75

క. పృథుబలుఁడు పృథుశ్రవసుఁడు, ప్రథన జయోద్దాముడైన పార్థునిమీఁదన్
రథము పరఁగించి యమ్ముల, మథియించుచు నిబ్బరంపు మదమునఁబలికెన్. 76

క. కవ్వడి నెవ్వడి నీవీ, పువ్వారుం బోడిఁ గొనుచుఁ బురికేగెదు నీ
క్రొవ్వరఁజేసెదఁ జూడుము, క్రొవ్వాడి కడింది వాలుఁ గోలలచేతన్. 77

గీ. అనుచు దురహంకృతినిఁ బల్కి యతని మీదఁ
బ్రళయ కాలానలాభీల పటుతరాస్త్ర
జాలములు నింప విజయుండు సదమలార్ధ
చంద్ర సాయకమున వాని సంహరించె. 78

క. వాఁడంతటఁ బోవక బలు, వాడి ములుకు లేయఁద్రుంచి వాసవి మిగులన్
వేడి వెదజల్లు తూపునఁ, బోడిమి చెడనేసి బిట్టు పొంగి చెలంగెన్. 79

క. సేనా నాయకుఁడప్పుడు, నానావిధ శరములేయ నరుఁడన్నియుఁ దో
డ్తోనే నలి గావించియ, నూనక్రోధమునఁ బుడమి కురువడి నుఱికెన్. 80

గీ. పోరిక బెడిదంపు వాలొరవెరికి వాని, రథ్యములఁ గూలనఱికి సారథినిఁదునిమి
రథము భగ్నంబుచేయనా రథికుఁదురికి, పౌరుషంబేది తా విడఁబఱచెనంత. 81

మ.కరులంద్రుంచి శతాంగముల్ దునిమి కంఖాణంబులం గూల్చి తో
మర చక్రాసి గదా త్రిశూల శర వర్మ ప్రాశ సంయుక్త భీ
కర యోధావలిఁజంపి చామర పతాకచ్ఛత్ర ముఖ్యోల్లస
ద్బిరుద శ్రేణులు నుగ్గునూచములుగా భేదించి బిట్టార్చుచున్. 82

ఉ. కొందఱి సింహనాదములఁ గొందఱి నిష్ఠుర ముష్టి ఘట్టనన్
గొందఱిఁ బాణజాలములఁ గొందఱి కుంత కుఠార ధారలన్
గొందఱి భిండివాలముఁ గొందఱి ఘోరనిశాత హేతులన్
గొందఱిఁ జక్ర శూలములఁ గూల్చె ధనంజయుడుఁ డుగ్ర మూర్తియై. 83

గీ. భామ వీక్షణమాలా శిలీముఖములు, దన్నుఁ గాడంగ నుక్కున దన నిశాత
ఘనశిలీముఖ పంక్తులంగములుగాడ, నేసివధియించె రిపులనయ్యింద్రసుతుఁడు. 84

క. విజయాఖ్య సార్థముగ రిపు, విజయంబొనరించి యపుడు వెలఁదియుఁ దానున్
బ్రజలెల్ల సన్నుతింపఁగ, నిజనగరికి నరదమెక్కి నెవ్వడిఁ జనియెన్. 85

వ. అట్లుచని పురోపకంఠాకుంఠ శృంగార రంగన్మహోద్యాన మధ్యస్థలంబున నధివసించి యున్నఁ దద్వృత్తాంతంబు విని ధర్మనందనుం డానంద కందళిత హృదయారవిందుం డగుచు గోవిందుని నభినుతించి పురంబలంకరింపఁజేసి సముచిత ముహూర్తంబు వీణావేణుమృదంగ భేరీ కాహళారావంబులు చెలంగ వారాంగనా లాస్యవిద్యా విశేషంబులుఁ గరంబు నింపుసొంపులు నింపఁ బుణ్యసతీకృత మంగళప్రదాభంగ సంగీత నాదంబులును రథనేమి నిర్ఘోషంబులును పురజన సందోహ సంభ్రమాలాపంబులును నేకీభవించి రోదసీకుహరాంతరం బద్రువ మ్రోయ ఛత్రచామరాందోళికా వైజయంతీ ప్రముఖ లాంఛనంబులు పెల్లడర సువర్ణ వేత్రపాణులందంద సందడిం బరాబరులు గావింప భీమసేన నకుల సహదేవులం గైచేసి యనుప వారలు మదోన్నిద్ర దంతావళాధి రూఢులై తమతమ పిరుంద నమంద సుందర స్యందనంబులెక్కి దిక్కుల రాజలోకం బరుదేర నరిగి యర్జునుండున్న యుపవన సమీపంబున వాహనంబుల డిగ్గియున్న నయ్యర్జునుండెదురు వచ్చి భీమసేనునకుం బెద్దలకు నమస్కరించి తనకుం బ్రణమిల్లిన తమ్ములం గౌఁగిటంగూర్చి కొంతతడవు విహితగోష్ఠిం బ్రవర్తించి లేచి నిజ వాహనా రూఢులై చరమభాగంబున సుభద్రాకన్యకారత్నంబుంచి రత్నకల్పితలాలిత కాంచనాందోళికాంతరంబున నరుగుఁదేర నియమించి రాజమార్గంబునం జనుచున్న సమయంబున. 86

గీ. పట్టణంబున గల పద్మపాణులెల్ల, మేలి రతనంపు జాలువా మేడలెక్కి
కసుమ లాజాక్షతంబులు గొప్ప ముత్తి,యంపు సేసలు జల్లి దీవింపుచుండ. 87

క. రాజముఖులపుడు గొందఱు, రాజిత పాత్రముల దీపరాజులునిచి నీ
రాజనము లొసఁగి రెలమిన్, రాజకులాంభోనిధాన రత్నంబునకున్. 88

క. భూసురులాశీర్వాదము, లాసక్తిం జేయుచుండ నానంద రసో
ల్లాసుండై వాసవసుతుఁ, డాసన్నాత్మీయ మందిరాంగణ భూమిన్ 89

గీ. వాహనముడిగ్గి పాదుకారోహణంబుఁ, జేసి గేహళిదాఁటి విచిత్రహేమ
మంటపాభ్యంతరోజ్వల మణిశుభాస, నమునఁగూర్చున్న ధర్మనందనునిగాంచి. 90

క. భయభక్తి సంభ్రమంబులు, దయివాఱఁగ నతని దివ్యతర పదకమల
ద్వయమున కర్మిలి మ్రొక్కిన, దయమీఱఁగఁ గౌఁగిలించి తగదీవించెన్. 91

గీ. అంతఁగుంతీ మహాదేవి యంతికమున, కరిగి దంపతు లత్యంత హర్షలీల
మ్రొక్కులొసఁగిన నామోదమునఁ జెలంగి, వారి దీవించి తద్దయు గారవించె. 92

క. దేవకి ముద్దుంగూతురు, ద్రోవదికి సమగ్రభక్తితో మ్రొక్కిన న
ద్దేవియు నతిహర్షంబున, దీవించి కవుంగిలించెఁ దిరమగు కూర్మిన్. 93

వ. అంత నొక్క సుముహూర్తంబున. 94

సీ. పగడంపుగోళ్ళ మేల్పసిడి చప్పర మంచ మంచదూది ఘటించినట్టి పఱపు
జానైన ముత్యాల జాలీల చందువా నిద్దంపు జిగి కుతి నీతలాడ
పసమించు జరబాబు పక్కదిండ్లు కడాని జాలవల్లికలు వింజామరములు
నిలువుటద్దములు మానికపు దివ్వెలు తమ్మిపడిగెముల్ చిన్నారి యడపములును

గీ. గలిగి ఘనసార కాశ్మీర గంధసార, సార సారంగమద హిమనీర ముఖ్య
బహుళ పరిమళ వస్తు సంభాసమాన, హారి శృంగార కేళికాగారమునను. 95

శా. లీలన్ బంగరు కీలుబొమ్మగమి హాళిన్ జెంగటన్ నిల్చి తాం
బూలంబిచ్చుచు వీణమీటుచును సొంపుల్మీఱ నొయ్యొయ్య కెం
గేలం వీవనలూని వీవఁగను పూనెంగ్రిడి పూపాన్పుపై
నా లోలాక్షి హొయల్ దలంచుచు నితాంతాసక్తితో నుండగన్. 96

గీ. కుంతియనుమతి ద్రౌపది కూర్మిమీఱ, విజయుని సుభద్రనొకటిఁ గావింపఁబూని
ప్రోడచేడెలఁగొందఱిఁ బూన్చుటయును, వారలవ్వారి జాతాక్షి గారవించి. 97

క. పన్నీట జలకమారిచి, సన్నపు క్రొంజలువ వలువ జతనముగఁ గటిన్
జెన్నలరఁగట్టనిడి వలి, జన్నులఁగలపంబలంది సకియలు మరియున్. 98

క. హాటక తాటంక తులా, కోటీ కేయూర ముఖ్య గురుమణి భూషా
కూటంబులు నెమ్మేనన్, నీటుఁగ్గఁ గైసేసి యనిరి నెనరొదవంగన్. 99

ఆ. నీరజాత నయన నీకు నీవిభునకు, నొకటి సేయ శుభ ముహూర్త మిపుడు
జాగు సేయకెలమిఁజనుదెమ్ము గుప్పున, నధిపుఁడున్న మణిగృహంబునకును. 100

సీ. కొమ్మ క్రొమ్ముడి దిద్దుకొమ్మ గట్టిగఁ బ్రాణవిభుఁడు చేనంటిన వీడకుండ
పడఁతి యొడ్డాణంబు నడుమున బిగియించు వరుఁడు పట్టిన నీవి వదలకుండ
పొలతి యంగదములు భుజముల గిరికొల్పు ప్రియుని గోరొత్తులు బెరయకుండ
సకియ కంచెలముడి జతనంబుసేయుము పతికి గుబ్బలు పట్టుపడకయుండ

గీ. కదనతలమున నరదంబుఁగడపి మగని, దెండమలరించి కడుపొగడికెలుఁగన్న
వలతివిక నీకు బుద్ధులుఁదెలుపనేల, సద్దుసేయక పదవమ్మ ముద్దుగుమ్మ. 101

ఉ. ఉబ్బుచు ద్వారకాపుర మహోపవనంబున నాతఁడుండఁగా
నబ్బురమొప్ప నీ వహరహంబును సేవయొనర్చు చున్నచో
గొబ్బునఁ జేయివట్టుకొని కూటమికీడ్చిన నాఁడె వీడె నీ
సిబ్బితి యింక నిప్పుడరసేయఁగ నేటికిఁ గన్యకామణీ. 102

సీ. ప్రాణనాథుఁడుగూర్మిఁ బల్కరించిన మాఱు వలుకక మౌనంబు వట్టరాదు
ప్రియుఁడు తాంబూలంబుఁబ్రేమ నీవచ్చిన నొల్లకఁజేమోడ్చి యుండవలదు
చెలువుఁడు గుబ్బలఁ గలపంబలందుచో బెడసి మాఱుమొగంబు వెట్టవలదు
పతి తీయమోవి చుంబనముఁగావించుచోఁ గఱటితనంబునఁ గసరవలదు

గీ. విభుఁడు గడితంపు వలపులు వెల్లివిరియ దంటతనమున నిక్కువలంటినప్పు
డులికి యించుక కొఱకొఱయయూనవలదు,సుమ్మ మేలికడాని కీల్బొమ్మకొమ్మ. 103

క. బిరబిరఁబదమను చెలియం, జురచుర కన్నెఱ్ఱఁజేసి చూచెదవా మేల్
చెఱకు విలుకాని దురమున, గుఱుతులిడు హృదీశుఁ జూచుకొమ్మా కినుకన్. 104

గీ. అనుచు నెచ్చెలు లీరీతి వినయమెసఁగ, నాదు మాటల తేటఁగా నాలకించి
తలఁపులోపల వలపుముందఱికి సిగ్గు, వెనుకకునులాగనయ్యరవింద నయన. 105

క. అడుగులుఁ దడఁబడ మోమునఁ, గడుఁజెమ్మటదొరుగ మేనుగరుదాల్పఁగ న
య్యుడురాజముఖుల వెంబడి, నొడయని పడకింటిలోని కొనరఁగఁజనియెన్. 106

క. చని పగడఁపుఁగంబము చా,టున మోమువంచి యిటునటుంగనుఁగొనుచున్
నునుసిగ్గు దొంతరల జ,వ్వని యించుక శిరము వాంచి వతనుగనుండెన్. 107

క. అనుఁగుఁజెలులపుడు విభుఁగన్,గొని దేవపరాకు మిగులగోల సుమీ యి
వ్వనజముఖి దీని మెల్లన, నెనరొదవఁగ దిద్దుకొనుము నేర్పు దలిర్పన్. 108

వ. అని పలికి. 109

క. పతిచేతి విడెము సతికిన్, సతిచేతి విడెంబు పతికిఁ జతురత మెఱయన్
హితమతి నిప్పించి సమం,చితగతి నొకరొకరె చనిరి చిటుకనకుండన్. 110

శా. అంతన్ జిల్క పఠాణి తేజి నెఱజోదాలీఢ పాదస్థుఁడై
కాంతారేక్షు శరాస మెక్కిడి సమగ్ర క్రూర సూనాస్త్రముల్
పంతంబారగ పింజపింజ గరువన్ బైపైఁ బ్రయోగించె న
క్కుంతీనందన రోహిణీ సుతలపైఁ గోపాతిరేకంబునన్. 111

ఆ. అపుడు నృపుఁడు నిర్భరాలింగనము చేసి, పొలఁతి బాల పానుపునకుఁ దార్చి
కడఁక మీఱి నాకుమడుపులందిచ్చుచు, నింపు మెఱయ దాని కిట్టులనియె. 112

క. తలయెత్తి చూడవేమియుఁ, జెలి యిత్తఱి నీకునింత సిబ్బితి యేలా
కలన నరదంబుఁ గడపిన, వలఁతి తనంబిపుడు చూపవలదా నాకున్. 113

సీ. ఉపవన స్థలిగాదు తపనీయ నవరత్న రచిత కేళీమందిరంబు గాని
పలుకుఁజిల్కలు గావు పదియాఱు వన్నెపుత్తడి కీలుబొమ్మ మొత్తములు గాని
నెలరాల జిగిలెగా దలఘు సౌరభమిళత్ప్రసమాన కుసుమ తల్పంబు గాని
యతివరేణ్యుఁడ గాను వితతవైభవ పరిభ్రాజిత నృపకుమారకుఁడ గాని

గీ. సేవకై తూరె వచ్చుచుఁబోవుచుండు రీతులివిగావు శంబరారాతి కదన
విజయకారణ సాధన విధులుగాని తరుణి నీకింక బొంకి పోఁదరము గాదు. 114

ఉ. ముప్పిరిఁగొన్న మోహమున మున్న యతీశ్వర రూపమూని సొం
పొప్పు భవద్గృహాంగణ మహోపవనంబున నుండి వెండి నన్
గుప్పున కౌఁగిలీక ననుఁ గొందలమందఁగఁజేసి యేగి తీ
విప్పుడటుల్ జుడింగి చన నింతయు శక్యము కాదు కోమలీ. 115

క. గుత్తపు గుబ్బలు ఱొమ్మున, హత్తుకొలిపి మోవి తేనియలు విందిడుచున్
జిత్తజుని కేళిసేయుము, మత్త మధువ్రత వితాన మంజుల చికురా. 116

గీ. ఏల యాలస్య మింకఁ దాళఁజాల బాల, కూళవలరేని వాలారు బూల కోరి
చాలుపులఁజాల నలిగితి వేళయెరిగి, వైళముననన్ను గౌఁగిట నేలుకొనుము. 117

క. అనుమానమేల మదిలో, వినుమా నామాట నాన విడఁద్రోచి కనుం
గొనుమా చిఱునవ్వొలయఁగఁ, జనమానస రంజనీక సదమలరూపా. 118

క. అని వినయంబును నేర్పును, నెనరు గనంబడఁగఁ బలుక నెలఁత యతనిపై
నను రాగము ప్రకటంబుగఁ, గనుదమ్ములొకింత విప్పి కడకన్ జూచెన్. 119

క. ఆ చూపులు మదనుని నా, రాచంబులు నొక్క మొగి ధరారమణునిపై
బ్రాచుర్యసరణిఁ బర్విన, నా చతురుండపుడు గడితమగు తమకమునన్. 120

సీ. అలకముల్ దువ్వి చెక్కులు నెన్నొసల్ కనుంగవయును ముద్దాడి కావి మోవి
పానకంబాని గుబ్బలు కేలఁ బుడుకుచు కక్షభాగమున నఖక్షతములు
పైపయిఁ గావించి పదగుల్ఫజాను స్థలములంటి పొక్కిలి నిమిరి మేన
గిలిగింతలొదవించి లలిఁబోకముడియూడ్చి జఘనంబు నూరువుల్ సరవిముట్టి

గీ. శిశిరకర కర సంస్పర్శ చేఁగరంగు, కలువ రామానికము పోల్కెఁ గరఁగఁజేసి
ప్రసవశరశాస్త్ర నియతి నప్పద్మముఖిని, రతులఁదేలించె నమ్మహీరమణ మౌళి. 121

గీ. అంత సురతాంతమున నింతి నంకపీఠి
నిలిపి గుబ్బలఁ జందనం బలది విడెము
చుట్టి యిచ్చుచు నెత్తావి సురటిఁ బూని
విసరుచును రేయిఁ గడపె నవ్విజయుఁ డెలమి. 122

వ. మరియుఁ గ్రమక్రమంబున నవోఢం బ్రౌఢ గావించి గాఢాలింగన చుంబనాది సంభోగ
లీలా వినోదంబులం దనియుచుండె నంత. 123

క. అటఁ బుర రక్షకులు హుటా హుటిఁజని హరిఁగాంచి మ్రొక్కి యుద్యానములో
జటియైయుండి సుభద్రం, దటుకున నర్జునుఁడు గొని పథంబునఁజనఁగన్. 124

గీ. అతని మార్కొని మేము నీయాన వట్టి
విడువుము సుభద్ర ననుటయు వినక పోయెఁ
బోరుఁ గావింపఁ గొందఱి బారి సమరి
ముగుదఁ గొంచు నింద్రప్రస్థమునకుఁ జనియె. 125

క. అని వారలు దెలిపిన విని, జనితామర్షారుణేక్ష జలరుహుఁ డగుచున్
గనుబొమ్మలు ముడివడఁగా ననుజన్ముని మోముఁజూచి హలి యిట్లనియెన్. 126

క. మేనత్త కొమరుఁడనుచున్, నానా విధములను బ్రోచినం గ్రొవ్వి కడున్
మే నెఱుఁగక యిటు చేసె న,హా నరుఁడిపు డెంత దుర్గుణాఢ్యుఁడు చెపుమా. 127

క. నిన్నెఱుఁగక నన్నెఱుఁగక, మున్నరికం గన్నె నిపుడు మ్రుచ్చిలి చనియెన్
మన్నిఁగొనక మన్నిటువలె, మన్నింపఁగరాదు పెక్కుమాట లిఁకేలా. 128

మ. అని కల్పాంత కృతాంతుఁడో యనఁగఁ గోపాటోప మేపార గు
ప్పున నత్యుద్ధతి లేచి సీరము కరాంభోజంబునం బూని నూ
తన నీలాంబర మొప్పఁగా గటిని సంధానంబుఁ గావించి య
ర్జునునిం జంపెదనంచు జాగ జలజాక్షుండడ్డమై యిట్లనున్. 129

క. ఓ యదునాయక యెచటికిఁ, బోయెదు నీ వధికరోష పూరిత మతివై
నాయమె హరిమూర్తి విటుల్, సేయఁగ నీకెవ్వ రెదురు క్షితి నూహింపన్. 130

ఆ. మేన యత్త కొడు కమేయ విక్రమశాలి, యర్జునుండు దలఁప దుర్జనుండు
గాడు మనసుభద్రఁ గాంక్షింపనటుచేసెఁ, గాని యిట్లుసేయఁగలడె యతఁడు. 131

ఆ. అయినఁగాని మించినట్టి కర్జమునకుఁ, జింతయేల వట్టి పంతమేల
సంతసంబు పూని శాంతమూర్తివి గమ్ము, రమ్ము ధర్మజుని పురమ్మునకును. 132

క. వా రన్నలుఁ దమ్ములు నీ, కారుణ్యము వలనఁగాదె కౌరవ బాధా
పారాంబు రాశిఁ గడచి మ, హా రాజసవృత్తి నెమ్మి నలరిరి రామా. 133

గీ. అనుచుఁగృష్ణుండు ప్రార్థింప హలధరుండు, సోదరిని మేనమఱఁదిని జూడఁగోరి
పరమకళ్యాణవస్తులు పాయసములు గొనుచు నరదంబునెక్కెఁదాననుచు వేడ్క. 134

క. తన పిరుదం గృష్ణుండును, ఘనబాంధవ జనులు హితులు గజ హయ రథ వా
హనులగుచుఁ గొలిచిరాఁగా, ననుపమ వైభవసమేతుఁ డగుచున్ జనియెన్. 135

వ. అట్లు చని యింద్రప్రస్థ పురంబుఁ బ్రవేశించిన. 136

చ. ఎదురుగ వచ్చి పాండుసుతు లేవురు మ్రొక్కిన వారిఁ గౌఁగిటన్
బొదివి బహూకరించి పరిపూర్ణ కృపామతిఁ జూచి గొబ్బునన్
సదమల హేమ రత్నమయ సౌధ తలాంతిక సీమకేగి స
మ్మదమునఁ దేరు డిగ్గి జనమాన్య చరిత్రుఁడు రాముఁడత్తరిన్. 137

క. అంతిపురి కరిగి వేడుకఁ, గుంతికిఁ బ్రణమిల్లి మిగులఁ గూర్మి సుభద్రా
కాంత నతిసేయ దీవన,లెంతయుఁగృపనొసఁగి హలియుఁగృష్ణుఁడునెలమిన్. 138

క. నవరత్న భూషణాంబర, నివహములు సువస్తువులును నెమ్మదిఁ దోఁబు
ట్టువునకు నిడి తద్దయు గా,రవ మొప్పఁగ బుజ్జగించి ప్రమదం బెసఁగన్. 139

వ. అంతం గుంతీమహాదేవి నగరున రామకృష్ణులు ధర్మజభీమార్జుననకుల సహదేవుల
తోడంగూడి యిష్టాన్నంబు లారగించి కొన్నిదినంబు లచ్చట వసియించి వారిచేత

సెలవు వడసి ద్వారకా నగరంబునకుం జని సకల సామ్రాజ్య సంపదలం బొదలు చుండిరర్జునుండు నఖిల శాత్రవ సముదయంబు నడంచి ధర్మజుఁ బట్టాభిషిక్తుం గావించి యిష్టోపభోగంబులం దనియుచుండె. 140

క. అని శౌనకాది మునులకు, ననఘ చరిత్రుండు రౌమహర్షణి వినిపిం
చిన నలరి వారలాతని, వినుతులు గావించి రఖిల వృజిన చ్యుతులై. 141

గీ. ఈ సుభద్రా వధూద్వాహ మెవ్వరైన
జదివినను వ్రాసినను విన్న సకల పుణ్య
ఫలములు లభించు నిష్టార్థములు ఘటిల్లు
నంత్యమున విష్ణు లోక సౌఖ్యంబు దొరకు. 142

క. శరదంబుద నిభహాసా, నిరుపమ తరుణీయవాస నిత్యోల్లాసా
పరిపాలిత నిజదాసా, పురుషోత్తమ పుర నివాస భూరి విలాసా. 143

విద్యున్మాలావృత్తము. పారావార స్ఫారాగారా
ధీరాధారా దివ్యాకారా
సారాచారా క్ష్మాభృద్ధీరా
సూరిస్తుత్యా క్షుద్రోదారా. 144

మాలిని. సరస గుణ కలాపా సర్వలోక ప్రదీపా
పరిచిత మునిజాలా భవ్య కారుణ్య శీలా
హరిమణి నిభగాత్రా యామినీ శార్క నేత్రా
నిరుపమ ఖగవాహా నీల శైలేంద్ర గేహా. 145

*ఇది శ్రీమజ్జగన్నాయకదేవ దివ్యకృపానిరీక్షణ సంలబ్ధ సారకవితావిచిత్ర*
*కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర*
*సకల విద్వజ్జనవిధేయ జగన్నాథ నామధేయ*
*ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను*
*శృంగారరస ప్రబంధంబునందుఁ*
*సర్వంబును షష్ఠాశ్వాసము*
*సంపూర్ణము*